కేమునందుఁ గావున వసంతారంభమునఁ దుమ్మెదలు హిందోళరాగమున గానము చేసెను. వసంతర్తువునందు హిందోళరాగము పాడఁదగిన దనుటకు.—

మ. “అరిగా పంచమ మేవగించి నవలా లవ్వేళ హిందోళవై
ఖరిఁజూపం బికజాతమాత్తరవభంగవ్యాకులంబై వనీ
ధర నాలంబితపల్లవవ్రతవిధుల్ తాల్పం దదీయధ్వనిన్
సరిగాఁ గైకొనియెన్ వసంతము మహాసంపూర్ణభావోన్నతిన్.”

(వసుచరిత్రము. ఆ ౧-ప. ౧౭౯.)

తా. వసంతకాలము వచ్చినతోడనే పరభృతము కూయుంటయుం సాహూంత యాలకించి కాకము కోవెలను తన గూటినుండి వెడలఁగొట్టెను.

సీ. చలిగాలి బొండుమల్లెలపరాగము రేఁచి
నిబిడంబు సేసె వెన్నెలరసంబు
వెన్నెలరస ముబ్బి వెడలించె దీర్ఘికా
మందసౌగంధికమధునదంబు
మధునదం బెగఁబోసె మాకందమాలికా
క్రీడానుషంగిభృంగీరవంబు
భృంగీరవం బహంకృతిఁ దీఁగెసాగించెఁ
బ్రోషితభర్తృకారోదనముల
తే. విపినవీథుల వీతెంచెఁ గుపితమదన
సమదభుజనతసుమధనుష్టాంకృతములు
సరసమధుపాననిధువనోత్సవవిలీన
యువతియువకోటికోరికల్ చివురులొత్త. 29

టీ. చలిగాలి=చల్లనిగాలి, బొండుమల్లెలపరాగమున్ = బొండుమల్లె పూవులపరాగమును, రేఁచి = రేఁగించి, వెన్నెలరసంబున్ = చంద్రకాంతి యొక్కజలమును, నిబిడంబుసేసెన్ = పూర్ణమగునట్టుచేసెను. వెన్నెలరసము=

చంద్రికాద్రవము, ఉబ్బి = ఉబికి-పయికిఁబొంగి, దీర్ఘికా = దిగుడుబావుల యందలి, అమంద = విస్తారమయిన, సౌగంధిక=ఎక్కువసువాసనగల యెఱ్ఱకలువవలని, మధు = తేనెయొక్క, నదంబుల్ = ఏటిని, వెడలించెన్ = ప్రవహింపఁజేసెను. వెన్నెలరసము ఎఱ్ఱగలువపూవులలోని తేనియతోఁ గలిసి యేఱువలెఁ బ్రవహించె నని భావము. మధునదంబు = ఆ పుష్పమరందనదము మాకంద=రసాలములయొక్క, మాలికా=పఙ్క్తులయందలి, క్రీడా=ఆటల తోను, అనుషంగి = కూడుకొనిన, భృంగీ = ఆఁడతేంట్లయొక్క, రవంబు = ధ్వానమును, ఎగఁబోసెన్=విజృంభించునట్లు చేసెను. ఆఁడుతుమ్మెదలపాటలను టచేఁ గంఠరవమునందలి మనోహరత సూచితము. మగతుమ్మెదలపాటలకంటె, నాఁడుతుమ్మెదలపాటలె మనోహరముగా నుండు ననుటకు—"సుమచరదళినీ గానముక్రందై" అని వసుచరిత్రమునందును, సీ. "తీఁగెయుయ్యాల లెక్కి తూఁగియాడుచుఁ గూడి పాడెదు మత్తాళిబాలికలును" అని నిర్వచనోత్తర రామాయణమునందును గలయంశము లనుసంధించునది. భృంగీరవంబు = ఆఁడు తేంట్లయొక్క ధ్వని, అహంకృతిన్=గరువముచేత, ప్రోషితభర్తృకారోదనముల్ = పెనిమిటి యితరదేశమందుండుటచే విచారమునొందిన యువి దలయొక్క ఏడ్పులను, తీఁగె సాగించెను = వృద్ధిచేసెను. తేటులపాట లాలించి కామోద్రేకపరవశలై వియోగినులు విచారము నొందుచుండి రనుట. కుపిత = కోపించిన, మదన = మన్మథునియొక్క, సమద = మత్తతతోఁ గూడిన, భుజ=భుజములచేత, నత = వంపఁబడిన, సుమధనుః=పుష్పబాణము యొక్క, టాంకృతములు = టంకారధ్వానములు, సరస = రసముతోఁగూడు కొనిన, మధుపాన=మద్యపానముచేసి, నిధువన = రతిక్రీడజరుపుటయొక్క, ఉత్సవ=వేడుకయందు, విలీన = కలిసియున్న, యువతి=యౌవనాంగనల యొక్కయు, యువ = యౌవనపురుషులయొక్కయు. కోటి=సముదాయము యొక్కయు, కోరికలు = అభీష్టములు, చివురులొత్తన్=చిగిరింపఁగా, విపిన వీథులన్ = ఉద్యానవనములందు, పిఁతెంచెన్ = వ్యాపించెను.

పుష్పరసము గ్రోలుటవలనఁ దుమ్మెదలకు మృదుమధుర మగు కంఠరవము కలుగు ననుట సుప్రసిద్ధము. ప్రోషితభర్తృకలకు విచారదాయకముగా నుండె ననుటచేఁ దేఁటులపాటలు మఱింత శ్రావ్యముగా నుండె ననుట. మకరందపానముచేఁ దుమ్మెదల కంఠస్వరమునందు శ్రావ్య మతిశయించుటకు—

శ్లో. "రతిపతిప్రహితేవ కృతక్రుధః, ప్రియతమేషు వధూరనునాయికాః
బకుళపుష్పరసాసవపేశల, ధ్వనిరగాన్నిరగాస్మధుపాళినః.
మధురయా మధుబోధితమాధవీ, మధుసమృద్ధిసమేధితమేధయా
మధుకరాంగనయా ముహురున్మద, ధ్వనిభృతా ముహురున్మదముజ్జగే."

(మాఘకావ్యము.)

మద్యపానము కామోద్దీప మనుట ప్రసిద్ధము.

"దేశాంతరగతే కాన్తే ఖిన్నా ప్రోషితభర్తృకా" యని ప్రోషితభర్తృకాలక్షణము.

తా. వసంతకాలమందుఁ జల్లనిమారుతముచే నెగసిన మల్లికాపుష్పపరాగముచేత, చంద్రికవలన స్రవించుచున్నజలము చిక్కఁబడెను. వెన్నెలనీటి ముంపువలన బొడ్డనబావులయందలి యెఱ్ఱకలువలవలని పూఁదేనె నదములై ప్రవహించెను. ఆపుష్పమరందముయొక్క కాలువచేతఁ దియ్యమామిడిచెట్లలోఁ దిరుగుచున్న మధుకరములధ్వని హెచ్చెను. వానిచే దేశాంతరమందున్న భర్తలంగూర్చి యేడ్చు స్త్రీలవిచారములు వృద్ధిపొందెను. వానిచే మదనుని పుష్పబాణముల మ్రోఁతలు విహారవనములం దలముకొనెను. ఆబాణధ్వనులు వ్యాప్తముకాఁగా మధురము లయినమద్యములం ద్రావి యాడుచున్న స్త్రీపురుషులకాంక్షలు తీఱెను. అలం కావ్యలింగము. కారణమాల.

క. అత్తఱి ముఱిపపునడఁ జెలి
కత్తియగమి గొలువ మృదులకలభాషలఁ ద
ళ్కొత్తెడు వెడనగవులతోఁ
జిత్తభవుం డార్వ నలు చిదుము నెపమునన్. 30

టీ. అత్తఱిఁ = ఆ సమయమందు, మురిపపునడఁ = యౌవన మదముచే మైనగమనముతో, చెలికత్తియగమి=నేస్తకత్తెలగుంపు, కొలువఁ= పరిచర్యసేయఁగా, మృదులకలభాషలఁ = మృదువగునుచ్చారణగల పలుకులతోను, తళ్కొత్తెడు పెడనగవులతోఁ = వెలుఁగుచున్న చిఱునగవులతోను, చిత్తభవుండు = మారుఁడు, ఆర్వఁ = అఱవఁగా, ననలు = పుష్పములు, చిదుము నెపమునఁ = త్రెంపుట యనుమిషచేత. ముందఱికన్వయము.

ఆర్వఁగాఁ = సింహనాదముచేయఁగా నని కొందఱు, విచారముతో విలపింపఁగా నని కొందఱు వ్రాసిరి. తనములుకు లగుపూలఁ గోయం యువతులఁ గోపించునటు లఱచుచుండె ననుట సమంజసముగా నున్నది.

తా. ఆ వసంతకాలమందు యౌవనగర్వపునడకలతోఁ జెలికత్తెలు సేవించుచుండ మార్దవముగల పలుకులతోడను, చక్కని చిఱునవ్వులతోడను మదనుఁడు కేకలువెట్టునట్లు పుష్పములు గోయుంట యను నెపమున.

చ. అలకనిజీబులోఁ గుసుమ మద్దినపావడ దోఁపఁ గొప్పుచెం
గలువలవల్పుఁ జన్నుఁగవకస్తురితావియుఁ ద్రస్తరింప నం
దెలరొద మీఱఁ బెన్నిధిగటీఁ ప్రతికింబొడకట్టె వేల్పుఁదో
య్యలిచిఱుసానఁబట్టినయనంగునిమోహనబాణమో యనన్.

టీ. వేల్పుఁ దొయ్యలి = పుంజికస్థల, అలకనిజీబులోఁ = పలుచని చీరలో, కుసుమము = రక్తవర్ణము - కుసుంబారంగు, అద్దిన = వేసిన, పావడ = కుచ్చెకోక, తోఁపఁ = మీఁదికిఁ గాన్పింపఁగా, కొప్పు=తురుము నందుఁ దుఱిమిన, చెంగలువల = రక్తోత్పలములయొక్క, వల్పుఁ = సౌరభమును, చన్నుఁగవ = కుచద్వంద్వమునందుఁ బూయఁబడిన, కస్తురి = మృగనాభియొక్క, తావియుఁ = సౌరభమును, త్రస్తరింపఁ = నలువైపులకుఁ బ్రసరింపఁగా, తచ్చనలాడగా నని యొక వ్యాఖ్యాత. అందెలరొద=అందెల

యొక్క చప్పుడు, మీఱన్ = అధికము కాఁగా, పెన్నిధిగలిన్ = పెద్దనిక్షేపము రీతి, చిఱుసానన్ = చిన్నమెఱుఁగుసానయందు, పట్టిన = నూఱిన అనంగుని = మదనునిదైన, మోహన బాణమో = మోహమును గలిగించు పుష్పబాణమేమో, అనన్, వ్రతికిన్ = ఆ మునీశ్వరునకు, పొడకట్టెన్ = తెలిసెను.

మరునిబాణము లైదింటిలో నొకటి మోహకరము. పుంజికస్థల చిఱుసానపట్టిన మరుని సమ్మోహనబాణ మనుటచేఁ జూచినంతన వలపుగొలుపు ననుట. మరునిబాణములలో నొకటి సమ్మోహకర మనుటకు—

"ఉన్మాదనస్తాపనశ్చ శోషణ స్తంభన స్తథా,
సమ్మోహనశ్చ కామస్య పంచబాణాః ప్రకీర్తితాః."

తా. పుంజికస్థల యనునప్సరస్త్రీ రక్తవర్ణముగల గాగరా ధరించి దానిమీఁద సన్నపాఁటిపైఁట వైచుకొని సౌరభమును వెదఁజల్లురక్తోత్పలములను గొప్పునఁ బెట్టుకొని స్తనద్వయమున కస్తూరిగంధము నలందుకొని మదనునియొక్క మోహనబాణమో యనునట్లు కాలియందెలు ధ్వనిసేయ నొయ్యారముగా నడచుచు నామునియెడకుఁ జని నిలువంబడెను.

తే. అత్తెఱంగున నదిరిపా టారజంపు
వన్నెఁ బొడకట్టి తాఁ బాడుసన్నరవళి
పాట లళిఝుంకృతిశ్రుతిఁ బాడుకొనఁగఁ
జూడకయ చూచుచూపుతో సుడియుటయును. 32

టీ. అత్తెఱంగునన్ = అట్లు, అదిరిపాటు = హఠాత్తుగా, ఉన్నటులుండి, ఆరజంపువన్నెన్ = అందమగువేసముతో, పొడకట్టి = కాన్పించి, తాన్ = ఆ పుంజికస్థల, పాడు = పాడుచున్నట్టి, సన్నరవళి = సన్ననిధ్వనితోడిపాటలు, అళిఝుంకృతిశ్రుతిన్ = తేఁటులనాద యను శ్రుతియందు, పాడుకొనఁగన్ = నెలకొనఁగా-లయింపఁగా ననుట, చూడకయ = వీక్షించ

నట్లే, చూచుచూపుతోన్ = వీక్షించునట్టి కడగంటిచూపులతో-చూడనటుల నటించి చూచునోరచూపులతో, సుడియుటయును=చుట్టుకొని సంచరింపఁగా.

తా. అట్లకస్మాత్తుగా నందమయినవేసముతో సామానికిఁ గాన్పించి. తేంట్లఝుంకారములతోఁ గలియునట్లు సన్ననిధ్వనితో సంగీతముఁ బాడుచు నోరచూపులతో సామానిం జూచుచుఁ జుట్టి చుట్టి సంచరించుచుండఁగా.

చ. తలకొని దానితమ్ములపుఁదావియు మోవియుఁ గౌను మేనున
గ్గలపు మెఱుంగులీను తెలిగన్నులుఁ జన్నులు భృంగమాలికన్
గెలిచిన యారుతీరుఁ దగు నెన్నడలున్ దొడలున్ వివేకముం
గలఁపఁగఁ గాంచి పంచశరకాండవిఖండితధైర్యసారుఁడై. 33

టీ. దానితమ్ములపుఁ దావియున్ = ఆపుంజికస్థలయొక్క తాంబూలపు సౌరభమును, మోవియున్ = అధరోష్ఠమును, కౌనున్ = నడుమును, మేనున్ = శరీరమును, అగ్గలపు మెఱుంగులు = అధికమగు ప్రకాశములను, ఈను తెలిగన్నులున్=జనింపఁజేయు తెల్లని నేత్రములును, చన్నులున్ = స్తనములును, భృంగమాలికన్ = తేంట్లమొత్తమును, గెలిచిన యారుతీరున్ = జయించిననూగారుయొక్కయందమును, తగు నెన్నడలున్ = తగినగమనములును, తొడలున్ = ఊరువులును, వెనుకటిపద్యమునందుఁ బుంజికస్థల చూచియుఁ జూడనటుల నోరచూపులతో మునినిఁ దిలకించెను. క్రేఁగంటితోఁ గాంచుతఱి కనుపాపకొలకుల కేఁగుటచేఁ గన్నంతయుఁ దెల్లఁగాఁ గాన్పించుగాన కవి యిటఁ దెలికన్నులని ప్రయోగించెను. పెద్దన చూపులఁ దెలుపుగ వర్ణించును. రెండవయాశ్వాసమున—"విలోకనప్రభావీచికలం దదీయపదవీకలశాంబుధి" "చంద్రికల్ దనుకంజూచె, కన్నుఁగవధవళరుచుల్." అని చూపుల శుక్లవర్ణములుగనె వ్రాసెను. కవిసమయమునందుఁ జూపులను తెల్లనివిగ నల్లనివిగ నుభయములుగా వర్ణించుట గలదు. తలకొని=వహించి, వివేకమున్ = తెలివినిఁ, కలఁపఁగన్=కలఁతపరుపఁగా, కాంచి = పుంజికస్థలను వీక్షించి, పంచశర =

మదనునియొక్క, కాండ=శరములచేత, విఖండిత = బాగుగా ఖండింపఁబడిన ధైర్యసారుఁడై = ధైర్యబలము గలవాఁడై, ముందటి కన్వయము.

తా. పుంజికస్థలయొక్క తమ్ములపుసౌరభమును, దానియంగములయందమును, దానివీక్షణములసొబగును, దానిగమనపుచక్కఁదనమును గనుఁగొని యాపారుఁ డనుమౌని ధైర్యము దూలి మదనవేదన గలవాఁడై. అలం. ఉపమ-కావ్యలింగము.

క. మేను గరుపాఱఁ దమి న
మ్మౌని జపముఁ దపముఁ దన్నుఁ మఱచి యనంగ
గ్లానిఁ బడి కదిసి వడఁకుచు
హీనస్వర మెసఁగఁ బ్రోవవే నన్ననుచున్. 34

టీ. అమ్మౌని=ఆముని, మేను=శరీరము, గరుపాఱన్=పులకరింపఁగా, తమిన్=కోరికచేత, జపమున్=మంత్రావృత్తిని, తపమున్=నియమవంతమగు నిశ్చలదీక్షను, తన్నున్ = తనతపోనిష్ఠాదికమును, మఱచి = మఱచిపోయి, అనంగగ్లానిన్=మదనవేదనను, పడి=అనుభవించి, కదిసి = పుంజికస్థలను సమీపించి, వడఁకుచున్ = సాత్త్వికభావజనితమగు కంపము నొందుచు, హీనస్వరము=ధ్వనితగ్గుట, ఎసఁగన్=విశేషముకాఁగా, నన్నున్, ప్రోవవే = రక్షింపవే, అనుచున్=అని ప్రార్థించుచు, ముందటి కన్వయము.

తా. ఒడలు గగుర్పొడువ నాముని కోరికతో జపతపములను దన్నును మఱచి మదనవేదనం బొంది దానిం జేరి హీనస్వరముతో నన్ను రక్షింపుము రక్షింపు మని మిగులదైన్యముగాఁ బలుకుచు.

తే. చెయ్యిపట్టినమాత్రాన శిరసు వంచి
యవశచందానఁ బైవ్రాలునవ్వధూటిఁ
బర్ణశాలాంతరముఁ జేర్చి బ్రాహ్మణుండు
కెరలుకోర్కులఁ గందర్పకేళిఁ దేలె. 35

టీ. చెయ్యిపట్టినమాత్రానన్ = హస్తము గ్రహించినమాత్రముచేతనే, శిరసు = శిరస్సును, వంచి, అవశచందానన్ = మోహమున మునిఁగినదానివలె, వైవ్రాలునవ్వధూటికన్=మీఁదఁబడినయాయప్సరసను, పర్ణశాలాంతరమున్ = పర్ణగృహమునకు, చేర్చి, బ్రాహ్మణుండు=పాఱుఁడు-బ్రహ్మర్షియగునా మునీంద్రుఁడు, కెరలుఁగోర్కులన్ = వృద్ధిపొందుచున్నకాంక్షలతో, కందర్పకేళిన్ = మదనకేళియందు, తేలెన్ = సౌఖ్యము ననుభవించెను.

తా. చేయి పట్టుకొనఁగానే తలవంచి మోహముఁ జెందినదానివలెఁ బుంజికస్థల మీఁది కొఱఁగఁగాఁ బర్ణశాలలోనికిఁ దీసికొనిపోయి మిక్కుటమగు కాంక్షలతో బ్రహ్మర్షి యగుపాఱుఁడు రతిసౌఖ్యము ననుభవించెను.

క. *తపమంతయుఁ బొలివోవఁగ
నపు డన్నియు నుజ్జగించి యయ్యంగనతోఁ
దపసి మనోజక్రీడా
విపులైశ్వర్యంబు ననుభవించుచునుండెన్. 36

టీ. తపసి = ముని, తపమంతయున్ = తానొనర్చిన తపస్సంతయును, పొలివోవఁగన్ = వృథాయగునట్లు, అపుడు, అన్నియున్=జపము తపము మొదలయిన వన్నియును, ఉజ్జగించి=విడిచి,అయ్యంగనతోన్ = పుంజికస్థలతో, మనోజక్రీడా = రతివలని, విపుల = విస్తారమయిన, ఐశ్వర్యంబులు = సుఖసంపత్తులను, అనుభవించుచుండెన్ = పొందుచుండెను.

తా. ఆముని తపస్సు పాడగునట్లు జపము మొదలగునవివిడిచి యాదేవతాంగనతో రతిసౌఖ్య మనుభవించుచుండెను.

---

* పాఠాంతరము.

క. తపనోదయాస్తమయము
లిపు డని కాలప్రమాణ మెఱుఁగనితమి న
చ్చపలాక్షిఁ గూడి రతిసుఖ
విపులైశ్వర్యంబు ననుభవించుచు నుండెన్.

క. ఈరీతిఁ గొంత కాలం
బారామమహామహీధరారణ్యములం
దారామవలలఁ దగిలి వి
హారము సలుపంగ గర్భమై తఱి యగుడున్. 37

టీ. ఈరీతిన్ = ఈవిధముగా-ఇటుల సంభోగసౌఖ్యముల ననుభవించుచు, కొంతకాలము = స్వల్పకాలము - కొన్నిదివసములు, ఆరామవలలన్ = ఆయప్సరసయొక్క వలపనుజాలమందు, తగిలి = చిక్కి, ఆరామ=ఉద్యానము లందును, మహామహీధర = ఘనపర్వతములయందును, అరణ్యములన్=విపినము లందును, విహారము=కేళిసంచారము, సలుపంగన్=ఒనర్పఁగా, గర్భమై = అది గర్భిణియై, తఱియగుడున్ = ప్రసవసమయము రాఁగా.

తా. అతఁ డవ్విధమున నప్సరసతోఁ గొంతకాల ముద్యానవనముల యందును, గొప్పపర్వతములయందును, అడవులయందును రతివిహారము సలు పఁగా నది చూలు దాల్చి ప్రసవసమయము తటస్థింపఁగా.

---

టీ. ఇపుడు = ఈసమయమునందు, తపనోదయాస్తమయములు = ప్రొద్దువొడుచుట క్రుంకుట, అని, కాలప్రమాణము = కాలపరిమితి, ఎఱుఁ గనితమిన్ = తెలియనిమమతతో, అచ్ఛపలాక్షిన్ =అయ్యప్సరసను, కూడి = కలసి, రతిసుఖవిపులైశ్వర్యంబులు = రతిసుఖమువలని యెక్కువగుసంపదలను, అనుభవించుచుండెన్ = పొందుచుండెను,

తా. ప్రొద్దు పొడుచుటయుఁ గ్రుంకుటయునను కాలపరిమాణ మెఱుఁ గనితమితో ముని యయ్యప్సరసం గూడి యెక్కుడురతిసౌఖ్యము ననుభవించు చుండెను.

ఈపద్యము కొన్నిప్రతులందె గానవచ్చుచున్నదిగాన నిది ప్రక్షిప్తమని తలంచి బ్రౌనుదొరవారు వ్రాయించినటీకయందు అర్థము వ్రాయఁబడదయ్యెను, ఈపద్యముకంటెఁ బైనిజేర్చినపద్యమె రసవత్తరముగనుంటచే నిది ప్రక్షిప్తము కానోపు.

క. అంత ననుఁ గాంచి యుదిదివిపి
నాంతరమునఁ బాఱవైచి యరిగెఁ గృపార్ద్రి
స్వాంతుఁడగుసంయమీంద్రుఁడుఁ
జింతింపక పోయె నేమి చెప్పుదు నధిపా. 38

టీ. అధిపా = రాజా, అంతన్ = ప్రసవమైనయనంతరము, అది = అపుంజికస్థలయను నప్సరస, ననున్ = నన్ను, కాంచి = కని, విపినాంతరమునన్ = వనమధ్యమున, పాఱవైచి = విసరి పడవైచి, అరిగెన్ = పోయెను. కృపార్ద్రిస్వాంతుఁడు = దయచే కరఁగినచిత్తముగలవాఁడు, అగుసంయమీంద్రుఁడున్ = అగునట్టిమునీంద్రుఁడును - సర్వభూత సమదర్శి యగు మునీంద్రుఁడునుగూడ ననుట. చింతింపకపోయెన్ = నన్ను గనుఁగొనక పోయెను. ఏమి చెప్పుదున్ = ఇఁక నే మని వచింతును?

తా. కడుపారఁ గన్నజనని నిర్దయాస్వాంతురాలై యడవిలోఁ బాఱవైచి తనత్రోవను దాను వెడలిపోయెను. దయాస్వభావుఁడు సర్వసమదర్శి యగు మునియుం నాగతి నించుకేని విచారింపఁడాయెను. అపుడు నాపాట్లేమయ్యె నని చెప్పవచ్చును?

వ. అట్లు వైచి చనుటయు నాఁకటం గటకటంబడుచుండి తీండ్రించుశశిమండలంబున వెడలు. శిశిరకిరణప్రణాళికామిళదమృతరసగ్రాసంబునంజేసి కొన్నిపూఁటలం బుటపుటనైన నన్నుం గనుంగొని మునీంద్రుండు ప్రియంబంది నిజాశ్రమంబునకుం గొనిచని శశికళాసంవర్ధిత నగుటం జేసి నాకుం గళావతి యనునామం బిడి పెనుచుచుండ నేనును జనకసేవాపరతం బ్రవర్తిల్లుచుండునంత. 39

టీ. అట్లు = ఆవిధముగా, వైచిచనుటయున్ = పాఱవేసిపోఁగా, ఆఁకటన్ = ఆఁకలిచే, కటకటంబడుచుండి = బాధచేఁ బడియుండి, తీండ్రించు శశిమండలంబునన్ = మిగులఁ బ్రకాశించుచున్న చంద్రబింబమునుండి,

వెడలు = పుట్టుచున్న, శిశిరకిరణ = చల్లనికిరణములయొక్క, ప్రణాళికా = సమూహములతోడ, మిళత్ = కలసికొనుచున్న, అమృతరస = సుధారసము యొక్క, గ్రాసంబునం జేసి = తిండిచేత, కొన్నిప్రొద్దులన్ = కొద్దిదినములలో, పుటపుటన = వృద్ధిపొందుట కలదానను, ఐననన్నున్ = అయియున్న నన్ను, కనుంగొని = చూచి, మునీంద్రుండు = పాఱుఁడు, ప్రియంబు = దయను, అంది = పూని, నిజాశ్రమంబునకున్ = తనయాశ్రమమునకు, కొనిచని = తీసికొనివెళ్లి, శశికళాసంవర్ధితన్ = చంద్రకళలచే వృద్ధిఁబొందిన దానను, అగుటం జేసి=అగుటచే, నాకున్, కళావతి, అనునామంబు=అనునట్టి పేరు, ఇడి = ఉంచి, పెనుచుచుండఁగ = పెంచుచుండఁగా, నేనును, జనక సేవాపరతన్ = తండ్రిని భజించుటయందలియనురాగముచేత, ప్రవర్తిల్లుచుండునంతన్ = సంచరించుచుండఁగా, ముందఱి కన్యయము.

తా. అట్లు తల్లి కనఁగానే యడవిలో విడిచి పోఁగాఁ జంద్రకిరణములనుండి స్రవించునమృతధారలం గ్రోలి క్షుత్తు దీర్చికొని కొన్ని దినములు పెరుఁగుచుండఁ దరువాత నాజనకుం డగుపాఱుండు ననుం గని కనికరంబునఁ దనయాశ్రమమునకుం గొంపోయి నాకుఁ గళావతి యనునామ మిడి పెంచుచుండ నేనును నాజనకుని సేవించుచుంటిని.

పైవచనమునందలియర్థమే చెప్పంబడుటచే నీ క్రిందిరెండుపద్యములు ప్రక్షిప్తము లని బ్రౌనుదొరవారిటీకలో విడిచిపెట్టఁబడినవి. రెండు ప్రతులయందె యాపద్యములు చూపట్టుచున్న వనియుం వచనమె పెద్దనకవి దని యావ్యాఖ్యాతతలంపు.

ఉ. ఆసమయంబునం బొగులు చాఁకటిపెల్లున నంతకంతకున్
గాసిలి పైపయిన్ వదనగహ్వరమెండఁగ నేడ్చియేడ్చి యే
మాసయుఁగానకంతఁ దుహినాంశుఁడుదోఁచినఁదత్కళారస
గ్రాసవిధిన్ శరీర మమరంగ భజించితి దైవికంబునన్. 40

టీ. ఆసమయంబునన్=తల్లిపాఱవైచివెళ్లినప్పుడు, ఆఁకటిపెల్లునన్ = ఎక్కువగా నున్నక్షుత్తుచే, పొగులుచున్ = దుఃఖించుచు, అంతకంతకున్ =

అప్పటికప్పటికి, గాసిలి = కష్టపడి, పైపయిన్ = మీఁదమీఁద, వదనగహ్వరము = గుహావలెఁ దెఱవఁబడియున్ననోరు, ఎండఁగన్ = ఆఱునట్లు, ఏడ్చియేడ్చి = విలపించి విలపించి, ఏమూసయున్ = ఎట్టియాశయు, కానక = పొందక, అంతన్ = తరువాత, దైవికంబునన్ = దైవసహాయముచే, తుహినాంశుఁడు = సోముఁడు, తోఁచినన్ = ఉదయము కాఁగా, తత్కళారసగ్రాసవిధిన్ = ఆచంద్రకళాద్రవమును దిండిగాఁబెట్టుకొనుటచేత, శరీరము = దేహమును, అమరంగన్ = ఒప్పఁగా, భజించితిన్ = కాచుకొంటిని.

తా. తల్లి యట్లు కని పాఱవైచినప్పుడు క్షుద్బాధచే దుఃఖించుచు శ్రమఁజెంది నోరెండున ట్లేడ్చి యేడ్చి యాశ యేమియు లేక దైవసహాయమువలనఁ గలిగిన చంద్రకిరణములు ప్రసరింపఁగాఁ దద్రసపానమువలన శరీరమును గాపాడుకొంటిని.

సీ. ఏ నవ్విధంబున మేను పెంచుచు నుండ
        నాచంద మంతయు నాత్మ నెఱిఁగి
కడుసంభ్రమమున నక్కడకు నే తెంచి యిం
        పెసఁగ మైనిండినకసటు దుడిచి
తనయురంబునఁ జేర్చుకొనిపోయి యాశ్రమ
        స్థలమున నిజపర్ణశాల నుంచి
విధుకళాంశాహారవిధి పసించితిఁ గాన
        నాకుఁ గళావతీనామ మొసఁగి
తే. నయముమీఱంగఁ బెనుప నానాఁటఁ బెరిగి
శైశవము మాని యౌవనోత్సవముఁ జెంది
జనకు నేమైన నడుగుచు సంతతంబు
నోపి శుశ్రూష చేయుచు నున్నచోట. 41

టీ. ఏను=నేను, అవ్విధంబునన్=ఆరీతిని, మేన్=శరీరము, పెంచుచు నుండన్ = పోషించుకొనుచుండఁగా, ఆచందము = ఆవిధము, అంతయును,

ఆత్మన్ = చిత్తమునందు, ఎఱిఁగి = తెలిసికొని, కడుసంభ్రమమునన్ = మిక్కిలి తొందరతో, అక్కడకున్ = నేనున్నస్థలమునకు, ఏతెంచి = వచ్చి, ఇంపు = ఆనందము, ఎసఁగన్ = వృద్ధిపొందఁగా, మైన్ = నాశరీరమునందు, నిండిన కసటు = నిండుకొనినబురదను, తుడిచి, తనయురంబునన్ = తనవక్షమునందు, చేర్చుకొనిపోయి = అంటఁబట్టి యెత్తుకొని పోయి, ఆశ్రమస్థలమునన్ = తపోవనప్రదేశమందు, నిజపర్ణశాలన్ = తన యాకుటింటియందు, ఉంచి, విధుకళాంశాహారవిధిన్ = చంద్రకళాంశముల నాహారముగాఁ దీసికొనుట చేత, వసించితిన్ = ఉంటిని, కాన్ = కాఁబట్టి, నాకు, కళావతీనామము = కళావతి యనుపేరు, ఒసఁగి = పెట్టి, నయము = సుకుమారత్వము, మీఱంగన్ = అతిశయించునట్లు, పెనుపన్ = వృద్ధిఁబొందించఁగా, నానాఁటన్ = దినదినక్రమముగా, పెరిఁగి, శైశవము = పసితనము, మాని = విడిచి, యౌవనోత్సవమున్ = పరువపుగరువమును, చెంది, జనకున్ = జనకుని, ఏమైన నడుగుచున్ = ఏదియేని నడుగుచు, సంతతంబు = ఎల్లకాలము, ఓపి = ఓర్చి, శుశ్రూష = పరిచర్య, చేయుచునున్న చోటన్ = ఒనర్చుచుండునప్పుడు.

తా. ఆవిధముగా నేను శరీమును బెంచుచుండఁగా నది తెలిసికొని మిక్కిలి తొట్రుపాటుతో నేనున్నచోటున కేతెంచి సంతోషముతో నాశరీరమున నిండియున్నబురదం దుడిచివైచి తనవక్షమునందిడుకొని యాశ్రమమునకుఁ దీసికొనిపోయి పర్ణకుటీరమందుంచి చంద్రకళాద్రవమును నాహారముగాఁ జేసికొనుటచే నివసించి యుంటిం గాన నాకుఁ గళావతి యను నామకరణము సేసి చక్కఁగాఁ బెంచుచుండ దినక్రమమునఁ బెరిఁగి పెద్దదాననై తండ్రినన్నియు నడుగుచు నెల్లకాలము నోపికతో సేవచేయుచుండఁగా.

క. ఎవ్వరు చూచినఁ జూపులఁ
జివ్వకుఁ బద నడఁగి నడచుసిగ్గున నొఱపై
రవ్వకు మొదలగుపాపపు
జవ్వన మెదిరించె జిగి యెసఁగ నామేనన్. 42

టీ. ఎవ్వరుచూచినన్ = ఎవ్వరు నన్నుఁ దిలకించినను, చూపులన్ = తిరిగివారిని వీక్షించుటచేత, చివ్వకున్ = ఎదుర్కొనుటకు, చూపుల జగడమునకు, పదను = వాఁడి, అడఁగి=తగ్గి, నడచుసిగ్గునన్ = వ్యాపించునట్టి సిగ్గుచేత, ఒఱపై = అందమై, రవ్వకున్ = ఆడిపోసికొనుటకు, మొదలు = హేతువు, అగుపాపపుజవ్వనము = అగునట్టిపాపపుయౌవనము, నామేనన్ = నాశరీరమందు, జిగి =నిగనిగ యను ప్రకాశము, ఎసఁగన్ = వృద్ధికాఁగా, ఎదిరించెన్ =సంభవించెను.

తా. నన్ను వీక్షించినవారినిఁ దిరుగ వీక్షించుటకు సందేహమును బుట్టించునట్టిపాపపుసిగ్గు వృద్ధికాఁగా నీచిన్నది యిట్లున్నది యట్లున్నది యని యందఱును నాడిపోసికొనుటకు వీలయిన యౌవనము నాకు సంభవించెను.

శా. ఆవేళన్ బొడగాంచి ఖేచరుఁ డొకం డాసక్తి దేవాపిసం
జ్ఞావంతుండు సబాంధవుండగుచు నిశ్శంకన్ ననున్ వేఁడువాఁ
డై వాచంయముఁ డగ్నికార్యనిరతుండై యున్నచోఁ బర్ణశా
లావాసంబున కేఁగుదెంచి నిజభావాకాంక్షఁ సూచించినన్.

టీ. ఆవేళన్ = ఆయౌవనకాలమందు, ఖేచరుఁడొకండు=గంధర్వుఁ డొక్కండు, దేవాపిసంజ్ఞావంతుండు = దేవాపి యను నామముగలవాఁడు, పొడగాంచి = నను వీక్షించి, ఆసక్తిన్ = (నన్ను వివాహమాడవలె నను) కాంక్షతో, సబాంధవుండు = బంధువులతోఁగూడినవాఁడు, అగుచున్, నిశ్శంకన్ =జంకక, ననున్, వేఁడువాఁడై = కోరునట్టివాఁడై, వాచంయముఁడు = నాతండ్రియైనపారుఁడు, అగ్నికార్యనిరతుండు = హోమకార్యమునం దిష్టము కలవాఁడు, ఐయున్నచోన్ =అయియున్నపుడు; పర్ణశాలావాసంబునకున్ = ఆకుటిల్లయిన నివాసమునకు, ఏఁగుదెంచి = ఏతెంచి, నిజభావాకాంక్షన్ =తన హృదయమునం గలకోరికను, సూచించినన్ = తెలియఁజేయఁగా.

తా. అట్లు నేను వయోవంతురాలనై యుండఁగా దేవాపి యను నొక గంధర్వుఁడు నను గాంచి కామించి బంధువులతోఁ గూడ నాతండ్రి

తపోవనమునఁ కేతెంచి యాతండు హోమవిధి సలుపుచుండఁగాఁ బర్ణశాలఁ బ్రవేశించి నాతండ్రిని నన్నిమ్మని కోరుట యెట్లని జడియక హృదయమునం గల కోరిక తెలియఁబలుకఁగా.

సీ. శిఖిపింఛదళపరిష్కృతములై సేమంతి
విరులతీరగుశిరోవేష్టనములు
నెఱిగంటిచూడ్కిఁ దాయెతులబాహులు వంచి
నారాజు లల్లార్చునారజములుఁ
గాదంబరీగంధగర్భంబులై వల్చు
ఘనసారమిళితాస్యగంధములును
దరహాసములఁ దోఁచుతాంబూలసేవాంధ
కారితాధరరదక్షతులయొఱపుఁ

తే. జిటులుగందంపుఁబూతలు జిహ్వికలకు
ననుపు నెఱవాదిబంటుపంతపుఁబదరులు
ఘన మగుజాగుప్స వెనుప నజ్జనముఁ జూచి
ఋషి మనంబునఁ గడు నసహ్యించుకొనుచు. 44.

టీ. శిఖిపింఛ = నెమలిపింఛములయందలి, దళ = ఱెక్కలచేత-నెమిలి కన్నులచేత ననుట, పరిష్కృతములై = అలంకరింపఁబడినవై, సేమంతివిరుల తీరు = చేమంతిపుష్పముల విధముగలిగినవి, అగు, శిరోవేష్టనములును = తలపాగాలును, చేమంతిపూలవలె బల్లపఱుపుగాఁ దలగుడ్డలఁ జుట్టి నెమిలి యీఁక లందుఁ జెక్కికొనిరి, ఎఱగంటిచూడ్కిన్ =(మద్యపానముచే) నెఱ్ఱఁ బడిననేత్రదృష్టితో, తాయెతులబాహులు = సందిటితాయెతులుగల హస్తములను, వంచి, నారాజులు = కత్తులను, అల్లార్చు నారజములున్ = త్రిప్పెడు సౌందర్యములును, కనులు కెంపువారియుండెను. పలుమాఱు కత్తులను ద్రిప్పుచుండి రనుట. కాదంబరీ = మద్యముయొక్క, గంధ = పరిమళము, గర్భంబులై = గర్భమం దున్నవై, వల్చు = వాసనకొట్టునట్టి, ఘనసార=పచ్చకప్పుర

ముతోఁ, మిళత్ = కలిసిన, ఆస్యగంధములును = నోటిపరిమళములును ఎన్ని సుగంధద్రవ్యముల నుపయోగించినను మద్యగంధము విరివిగా వచ్చుచుండెననుటచే విశేషముగాఁ బానముచేసి రని భావము. దరహాసములన్ = మొలకనవ్వుతోడ, తోఁచు = కాన్పించుచున్న, తాంబూలసేవా = తమ్ములము వేయుటచేత, అంధకారిత = కాన్పింపనివిగా నొనర్పఁబడిన, అధర = ఓష్ఠములయందలి, రదక్షతుల = దంతక్షతములయొక్క, ఒఱపును = అందమును, దంతక్షతములకతన భోగపరాయణు లని తెలియును. చిటులుగందంపుబూఁతలును=బీటలువాఱుచున్న మంచి గందపుఁబూఁతలును, జిహ్వికలకున్ = నాలుకలకు, ననుపు = అలవాటయిన, నెఱవాది = చతురతగల, బంటుపంతపు = శూరులయొక్క ప్రజ్ఞలతోడి, పదరులును = తొట్రుపాటుపలుకులును, ఘనము=ఎక్కువ, అగుజుగుప్స = అయినయసహ్యతను, పెనుపన్ = పెంపఁగా, అజ్జనమున్ = ఆగంధర్వుల సముదాయమును, ఋషి = మౌని, చూచి, మనంబునన్ = చిత్తమునందు, కడున్, అసహ్యించుకొనుచున్ = అనిష్టమును సూచించుచు. ముందఱి కన్వయము. ముని శాంతవ్రతుఁ డగుటచేతను, ఆగతు లగు ఖేచరులు భోగపరాయణులుగాఁ గన్పించుచుంటచేతను, నిష్కామకర్ముఁడగు నామునికి వీరితీరు లేమియు రుచింపలేదని భావము.

తా. మాతండ్రి నన్నడుగుటకై తన గృహమున కేతెంచినగంధర్వులు మయూరబర్హములతలపాగలును, మద్యపానముచే రక్తవర్ణములు గలకన్నులును, సందిటిదండలతోఁ ద్రిప్పఁబడుచున్నకత్తులు చేతులయందును, మద్యపానమువలనఁ గలిగినవాసన పోవుటకై వేసికొనిన తాంబూలమువలననోటివాసనలును, చిఱునగవులును, దంతక్షతములు కాన్పించకుండున ట్లొంటింపఁబడిన తాంబూలరక్తిమతోఁ గలిసినపెదవులును, బీటలువాఱుచున్న చందనపుఁబూఁతలును, నేర్పుతోఁ గూడినతొట్రుపాటుపలుకులును గలిగి చిత్తమునకసహ్యము గలుగఁజేయఁగా వీక్షించి యసహ్యపడుచు. అలం. స్వభావోక్తి.

శా. ఆహా ధన్యుఁడ నైతి మద్విమలవంశాచారవిద్యాతప
శ్శ్రీహోమాదులు నేఁడుగా తుది ఫలించెన్ నాగవాసంబున

ద్గేహక్షోణికి బిడ్డ వేఁడుటకు నేతేఁగాంచుటన్ బ్రాహ్మ్యమిం
కోహోచాలుఁబో కాలిపోయెదరో పోరో నోటిక్రొవ్వేటికిన్.

టీ. ఆహా! నాగవాసంబు = భోగపుమేళము, మద్గేహక్షోణికిన్ = నాగృహమునకు, బిడ్డన్ = చిన్నదానిని, వేఁడుటకున్ = కోరుటకు, ఏతేఁ గాంచుటన్ = వచ్చునంతటిభాగ్యమును గాంచుటచేత, ధన్యుఁడనైతిన్ = కృతార్థుఁడనైతిని, మత్ = నాయొక్క, విమల = నిర్మలమైన, వంశ = కులము, ఆచార = యోగ్యవర్తనము, విద్యా = చదువు, తపః = తపస్సుయొక్క, శ్రీ = సంపద, హోమ = హోమములు, ఆది = మున్నగునవన్నియు, నేఁడుగా = ఇప్పుడుగదా, తుది = చివరగా, ఫలించెన్ = ఫలము నొందెను, ఓహో = బళిరా, ఇఁకన్ = ఇంకను, బ్రాహ్మ్యము = విప్రత్వము, చాలును, నోటి క్రొవ్వు = నోటియొక్క క్రొవ్వు, ఏటికిన్ = ఎందుకు, పో కాలిపోయెదరో = వెళ్లిపోయెదరా, పోరో = పోకయుండెదరా.

నాగవాస మన భోగము మేళమునకు భోగమువారలకును జెప్పవచ్చును. సీ. "నాగవాసం బన నామమా వేశ్యల మేళంబునకు" అని సాంబనిఘంటువు నందును, గీ. "నాగవాస మనఁగ నామమా వేశ్యాజనంబునకును." అని ఆంధ్ర నామసంగ్రహమునందును భోగపుమేళముపరముగ నాగవాసము జెప్పఁబడెను. సీ. "నాగవాసమున ఘంటాప్రతీశమునకు వేశ్యల కగుఁ బేరు విశ్వనాథ" యని యాంధ్రనామసంగ్రహ నానార్థవర్గునందును, సీ. "ననుపుకాఁడై వేల్పునాగవాసముగూడి" యని యిందును నాగవాసపదము వేశ్యాపర్యాయ పదముగాఁ జెప్పఁబడెనుగాన భోగము మేళ మనుటకు బదులుగ భోగమువారను టయుం సమంజసమె.

తా. ఔరా! భోగము మేళము నాకుమార్తెనిమ్మనియడుగ వచ్చునంతటి భాగ్యము గలిగెను. ధన్యుఁడనైతిని, నాకులాచారములకుఁ బవిత్రత గలిగెను. నాజపతప ఆదివిద్యలన్నియుఁ ఫలమునకు వచ్చెను. నా బ్రాహ్మణత్వము గణుతిం గాంచినది. ఏటి కీవృథాప్రలాపములు మాని వెళ్లెదరా లేక వెళ్లరా చెప్పుఁడు. అలం. వ్యాజస్తుతి - విషమము.

క. మీఁతరము వార లేతఱి
నేతరితనమునఁ దపస్విగృహకన్యకలన్
వీతభయవృత్తి వేఁడిరొ
కో తముఁ దర్కింప కౌర క్రొవ్వు లటంచున్. 46

టీ. మీఁతరమువారలు = మీవంటినీచులు - వేశ్యాకులమునందు జనించిన నిన్నుఁబోలిన నీచు లనుట. ఏతఱిన్=ఎప్పుడయినను, ఏతరితనమునన్= దుడుకుఁదనముతో, తపస్విగృహకన్యలన్ = తపము చేసికొను విప్రులయింటి చిన్నదానిని, వీతభయవృత్తిన్ = భయము లేక-మహామునులగు వీరల నడిగిన నేమిశపింతురో వారెక్కడ మనమెక్కడ అనుభయము లేక యనుట. తముజ్=తమమంచితనమును, తర్కింపక=ఆలోచింపక, వేఁడిరొకో = ఇమ్మనినవారు కారుకదా, ఔర! క్రొవ్వులు = ఏటి మదములు, అటంచున్=అని పలుకుచు. ముందఱి కన్వయము.

తా. ఇంతకుముం దెన్నఁడును మీవంటి నీచజాతివారు తమసంగతిని విచారించుకొనక తపస్సుచేసికొనునట్టి మాయట్టి సద్బ్రాహ్మణులపిల్లలను దమకొసంగవలసిన దని కోరియుండలేదు. ఇపుడు మీ రడుగుట యాలోచింపఁగా మదించిన మీవంటిమూర్ఖులు మీరే కాని పరులు కారని తెలియవచ్చుచున్న దని చెప్పుచు.

క. వసుధేశ ముక్కు డుస్సిన
పసరముక్రియఁ గెరలి తిట్టెఁ బక్కన ఋషి వా
రుసుగు మని వెడలిపోయిరి
ముసలి గదా పుట్టినిల్లు ముఖ్యోక్షతకున్. 47

టీ. వసుధేశ=ఓరాజా, ఋషి=నాజనకుఁడగుముని, ముక్కు డుస్సిన= ముక్కుఁద్రాడు వదలిపోయిన, పసరముక్రియన్=వృషభమువలె, ముకుఁద్రాడు పట్టు వదలినంతన వృషభ మేఁగునటుల, కెరలి=విజృంభించి, పక్కనన్=హఠా

త్తుగా, వెనుకముందు లాలోచింపక, తిట్టెక్ = దూషించెను, వారు = ఆగంధ ర్వులు, ఉసురుమని = ఆశలేనివారై - నిరాశచేఁ గలిగిన విచారముగలవారై, వెడలిపోయిరి=బయలుదేఱిపోయిరి. ముఖ్యోష్ణతకున్ = కోపస్వభావమునకు, ప్రధానమగు తీక్ష్ణభావమునకు, పుట్టినిల్లు = జన్మస్థానము, ముసలిగదా=ముసలి వాఁడేకదా. అలం. ఉపమ, అర్థాంతరన్యాసము.

తా. ముదుసలితనమేగదా కోపమున కాటపట్టు! ముదిమి హెచ్చు చున్న కొలఁది కోపము హెచ్చుచుండును గాన నావృద్ధమునీశ్వరుఁడు కోపము పెరిఁగి దూషింపఁగా నన్నుఁ గోరివచ్చిన గంధర్వులెందులకై యాతనిఁ గన్య నడుగవచ్చితి మనుహృదయవేదనతో వెడలిరి.

వ. అట్టియెడం దనమనోరథంబు విఫలం బగుటకుఁ గ్రోధాంధుం డై నన్నభిలషించుగంధర్వుం డిట్లనియె. 43

టీ. అట్టియెడన్=ఆసమయమునందు, నన్నభిలషించు గంధర్వుండు= నన్నుఁ గోరిన యాగంధర్వకుమారుఁడు, తనమనోరథంబు = తనయిచ్ఛ, విఫలంబు=కానిది, అగుటకున్=అయినందులకు, క్రోధాంధుండై=క్రోధముచేఁ గనుగాననివాఁడై, ఇట్లనియెన్.

శా. నీవైశిష్ట్యము తిట్టులన్ మెఱయునే నీకంటె నేఁ దక్కువే
యీవే కన్యక నీవుగాక మఱి మద్వృత్తాన్వయాచారముల్
నీవా పేర్కొనుపాటివాఁడ విలఁ గానీ నిల్తుగాకేమి పో
పో విప్రాధమ నిన్నుఁ బోల నిఁక నల్పుల్ లేరు దంభవ్రతా.

టీ. నీవైశిష్ట్యము = నీశిష్టత్వము, నీ సదాచారసంపన్నత యంతయుం తిట్టులన్ = దూషణలచేత, మెఱయునే = వెలుఁగొందునా-పదిమందినిఁ దిట్టి నంతన నీ వాచారవంతుఁడవను ప్రఖ్యాతినిఁ గాంచఁ గలుగుదువా? నీకంటెను, నేన్ = నేను, తక్కువే = తక్కువవాఁడనా- నే నెందును నీకుఁ దీసి పోవువాఁడఁ గా ననుట. నీవు, కన్యకన్ = చిన్నదానిని, ఈవే గాక = ఈయ

కున్న మానితివిగాని, మఱి, మత్ = నాసంబంధమయిన, వృత్త = నడవడికయు, అన్వయ = కులమును, ఆచారముల్ = స్వభావమును, పేర్కొను పాటివాఁడవు = ఇటువంటిది యటువంటిదని చెప్పనంతటి మంచితనముగలవాఁడవు, నీవా, ఇలన్ = పుడమియందు, నిల్తుగా కేమి =నిలిచియుందువులే, కానీ, విప్రాధమ = హీనబ్రాహ్మణుఁడా, పోపో = లేచి పొమ్ము పొమ్ము, దంభవ్రతా = కుత్సితవ్రత నిష్ఠలుగలవాఁడా, ఇఁకన్, నిన్నుఁబోలన్ = నీయట్టి, అల్పులు = హీనులు, లేరు.

తా. ఓదుర్మార్గుఁడ వగుబ్రాహ్మణుఁడా! శాపములచేతనా నీయాచార సంపద వెలుఁగొందును? నేను నీకన్నం దక్కువవాఁడనా? నీవు మాకుఁగన్య నీయకున్న నీయకుందువుగాక! మదన్వయాదులఁ దలపోయఁదగునా! ప్రాణములతో నిఁక భూమిపై నుండెదవుగా! పరుల మోసగించుటకు ముని వేసమును దాలిచి తిట్టులచేఁ దపస్తత్వమును వెల్లడించుకొను నీకంటె నీచు లెవరును లేరు.

తే. అనుచుఁ బగచాటి పోయి నాఁ డర్ధరాత్ర
సమయమున శస్త్రనిహతి మజ్జనకుఁ జంపె
నట్ల యగుఁగాక పుడమిఁ గామాంధచిత్తుఁ
డెవ్వరి వధింపఁ డెటు సేయఁ డేమి గాఁడు.

టీ. అనుచున్ =అట్లుపలుకుచు, పగచాటి = విరోధమును బ్రకటించి పోయి, నాఁడు = అదినము, అర్ధరాత్రసమయమునన్ = నడమురాత్రియందు, శస్త్రనిహతిన్ = కత్తిదెబ్బచే, మజ్జనకున్ = నాతండ్రిని, చంపెను, అట్ల యగుఁగాక=అట్లెయగుంగాని, అటుల జరుగుట సహజమెగాన, పుడమిన్ = ధరలో, కామాంధచిత్తుఁడు = కోరికవలనఁ గన్నుఁగానని హృదయముగలవాఁడు, ఎవ్వరిన్ = ఏరిని, వధింపఁడు = చంపఁడు. ఎట్లు సేయఁడు = ఏదుర్మార్గము చేయకుండును. ఏమిగాఁడు=ఎంతదుష్టుఁడు గాఁడు.

తా. అని యీ ప్రకార మాగంధర్వుఁడు పగను వెలువరించి యానాఁటియర్ధరాత్రంబున నాతండ్రిం గత్తితో నఱికి చంపెను. కోరికలు గలవాఁ డవ్విధి నొనర్చుట యొకవింతలోనిది కాదు. ఎంతెంతఘోరకార్యములఁ జేయుటకైనను సంకోచింపఁడు. అలం-అర్థాంతరన్యాసము.

తే. అపుడు మెడగోయఁ: ముని రోఁజు టాలకించి
మేలుకొని దివ్వె యిడి సంభ్రమించి యేడ్చు
నన్నుఁ బొదివిరి పొరుగిండ్ల నున్నతపసు
లాదురాచారుఁడును బాఱె నటకు మునుప. 51

టీ. అపుడు=ఆసమయమునందు, మెడగోయన్=కుత్తుక నఱుకఁగా, ముని=మునియగు నాతండ్రి, రోఁజుట=రొప్పుట, ఆలకించి = విని, మేలుకొని = లేచి, దివ్వెయిడి = దీపము పెట్టి, సంభ్రమించి = తొట్రుపడి, ఏడ్చు నన్నున్ = రోదనముచేయుచున్న నన్ను, పొరుగిండ్ల = ప్రక్కయిండ్లయందు, ఉన్నతపసులు = ఉండినమునీశ్వరులు, పొదివిరి = చుట్టుకొనిరి. అటకు మునుప=అంతకుముందే, ఆదురాచారుఁడును = ఆదుర్మార్గుఁడగు గంధర్వుఁడును, పాఱెన్ = పాఱిపోయెను.

తా. దుర్మార్గుఁ డగుగంధర్వుఁడు మెడగోయ నాతండ్రి యొగి రోఁజుచుండు నాధ్వని యాలకించి నేను లేచి దీపముఁబెట్టి చూచి విచారించి తొట్రుపాటు నొందుచుండఁగాఁ జుట్టుప్రక్కల నున్న మునీశ్వరు లందఱు వచ్చి క్రమ్ముకొనిరి. ఈసందడి గమనించి గంధర్వుఁ డెందేని యంతకు మున్న పాఱిపోయెను.

వ. అంతన్ తెలతెలవేగుటయుఁ బ్రభాతసమయంబున. 52

టీ. అంతన్, తెలతెలవేగుటయున్ = బాగుగఁ దెల్లవాఱఁగా, ప్రభాతసమయంబునన్ = ఉదయకాలమున.

క. ధారాళక్షతజోక్షిత
ఘోరజరాధవళితోరుకూర్చముగఁ గరా

చూరిని మెడ దెగి యుటజా
గారంబునఁ బడినమూఁడుగాళ్ల ముసలికిన్. 53

టీ. ధారాళ = తెంపులేక యొకేవిధముగాఁ గారుచున్న, క్షతజ = రక్తముచేత, ఉక్షిత = తడుపఁబడిన, ఘోర = భీతికరమగు, జరా=ముదిమిచేత, ధవళిత=తెల్లఁబడిన-నరసిన, ఉరు=పెద్దదియగు, కూర్చముగన్=గడ్డము మీసము గలుగునట్టుగా, కరాచూరిన్ = పదనైనకత్తిచేత, మెడతెగి, ఉటజాగారంబునన్ = పర్ణశాలయందు, పడినమూఁడుగాళ్లముసలికిన్ = పడియుండినవృద్ధునకు.

స్వసహాయముతో నడువఁజాలక కఱ్ఱ నాధారము చేసికొని నడచువానిని మూఁడుకాళ్లముసలి యందురు. సీ. "తల్లి మదేకపుత్రక పెద్ద కన్నులుగాన దివ్వాడు మూఁడుకాళ్లముసలి." (శృంగారనైషధము.)

కూర్చ మన గడ్డమనుటకుఁ బ్రమాణప్రయోగములు మృగ్య మని శ్రీనుదొరవారివ్యాఖ్యయందుఁ గలదు. కూర్చ మన గడ్డమునకు మీసములకెం(డ్రు?)కలకుఁ జెప్ప నగునని సర్వశబ్దసంబోధినియందుఁ గలదు.

తా. వాఁడియైనకత్తిచే నఱుకఁబడి నెత్తుటిచేఁ దడిసినమీసములుగడ్డము గలిగి భయంకరముగాఁ బర్ణశాలయందుఁ బడియున్న ముసలివానికి.

ఆ. అగ్ని యిచ్చి: యకట యాబాల్యముగ నన్నుఁ
బెనిచెఁ దల్లి వైచి చనినపిదపఁ
దానె తల్లి మాఱు నై నెమ్మి నట్టిమ
జ్జనకుఁ డీల్గె నేటి మనికి యనుచు. 54

టీ. అగ్నియిచ్చి=దహనముచేసి - అగ్నిసంస్కార మొనరించి, అకటా= అయ్యో, తల్లి=నన్నుఁ గన్నతల్లి (దయాశూన్యురాలై) వైచి చనినపిదపన్ = పాఱవైచి పోయినతరువాత, ఆబాల్యముగన్ = చిన్నతనమునుండి, తానె, తల్లి

మాఱునై=బదులుతల్లియై, నెమ్మిన్=ప్రేమతో, నన్నున్, పెనిచెన్=పెంచెను. అట్టిమజ్జనకుఁడు = అటువంటి మాతండ్రి, ఈల్గెన్ = మృతినొందెను. ఏటి మనికి=ఇఁక నేమి బ్రదుకు, అనుచున్ = అనుకొనుచు.

తా. తరువాత నగ్నిసంస్కారము మున్నగు కార్యములు నెఱవేర్చి, 'యయ్యో! నాతల్లి నన్నుఁ గని పాఱవైచినది మొదలుగాఁ దానే తల్లియై కాపాడి పెంచెను. అట్టినాతండ్రి మృతినొందఁగా నేను బ్రతికి యున్న నేమి ప్రయోజన' మని చింతించి.

క. వందురి వగలన్ దేహము
పొందెడలఁగఁ జూచు నన్నుఁ బొడగని దివిఁ దా
నెందుల కేఁగుచునో గిరి
నందన దిగివచ్చి కరుణ నా కిట్లనియెన్. 55

టీ. వగలన్ = దుఃఖములచేత, వందురి = పరితపించి, దేహము పొందు = శరీరసంబంధమును, ఎడలఁగన్ = వీడుటకై, చూచుచున్నన్= ఆలోచించుచున్న, నన్నున్, గిరినందన=పార్వతీదేవి, తాన్= తాను, దివిన్= గగనమార్గమందు, ఎందులకేఁగుచునో = ఎచ్చటికో వెళ్లుచు, పొడగని = చూచి, దిగివచ్చి = భూమిపైకి దిగి నాకడ కేతెంచి, కరుణన్=ప్రేమతో, నాకిట్లనియెన్ = నాతో నిట్లు చెప్పెను.

తా. తల్లిదండ్రులు లేనిదాననై యీనిరాధార మగుబ్రదుకు బ్రదికి యుండుటకన్నఁ బ్రాణత్యాగము చేసికొనుట మే లని యోజించుచుండఁగా నాకాశవీథిని నెచ్చటికో వెళ్లుచున్న పార్వతీదేవి నాయత్నముం గాంచి క్రిందికి వచ్చి కరుణతో నాకు నిట్లుగాఁ జెప్పెను.

మ. అతిసౌందర్యనిశాంత మీతను వలభ్యం బిట్లు శోకాతురా
న్వితవై దీనిఁ దొఱంగఁగాఁ దగునె తన్వీ చాలు నీసాహసం
బతిలోకుండు స్వరోచి నీకుఁ బతియౌ నారాజుఁ జేపట్టియ
ప్రతిమశ్రీవిభవంబుఁ గాంచెదవు నాపల్కొండుగా నేర్చునే.

టీ. తన్వీ = చిన్నదానా, ఈతనువు = ఈశరీరము, అతిసౌందర్య నిశాంతము = మిక్కిలి చక్కఁదనమునకు స్థానమైనది, అలభ్యంబు = (ఇట్టి దేహము) ప్రాప్తించుట కష్టము, ఇట్లు, శోకాతురాన్వితవై = దుఃఖముచే బాధింపఁబడినదానవై, దీనిన్ = ఇట్టి చక్కనిదేహమును, తొలఁగన్ = వదలుట, తగునె = ఒప్పునా, ఈసాహసంబు = ఈతెంపు, చాలున్, అతి లోకుండు=లోకాతీతుఁడు, స్వరోచి, నీకున్, పతి = భర్త, ఔన్=అగును ఆరాజున్ = ఆస్వరోచిని, చేపట్టి = పాణిగ్రహణముచేసికొని, అప్రతిమ = ఈడులేని, శ్రీ = ఐశ్వర్యముయొక్క, విభవంబున్ = వైభవమును కాంచెదవు=పొందెదవు. నాపల్కు, ఒండు=మఱియొకవిధము, కానేర్చునే అగునా.

లోకాతిశాయి సౌందర్యరాజిత మగు నీమేన పూర్వసుకృతాతిశయ చేతనే సిద్ధించినది. దీనిని విచారమును గారణముగాఁ జేసి వీడుట వెట్టి. భ శుభము స్వరోచియంతవాఁడు భర్త యగుటయే. సందియపడి యింక ను మించి చావఁజూచెదేమో! లోకపావని నగునాపలుకు వేఱు గా నీవెఱుంగుదువు గదా!

తా. ఓసుందరీమణి ! యింతచక్కని శరీరమును బొందుట బః దుర్ఘటము. ఎక్కువవిచారముచే మంచిచెడ్డల నాలోచింపక యిట్టిశ మును వదలుటకై తలపోసి యుంటివి. ఇది చాలతెంపైనపని. ఇట్టియూ తగదు. నీకు మహారాజగుస్వరోచి పెనిమిటి కాఁగలఁడు. అతనిం యమై సకలసౌఖ్యముల ననుభవించెదవు. నాపలు కాలకించి యీశరీరవ గాపాడుకొను మనియెను. అలం. కావ్యలింగము.

క. వినుమదియుఁగాక పద్మిని
యనఁ బరఁగినవిద్య నేఁ బ్రియంబున నిత్తున్

గొను నీవు తత్ప్రసాదం
బున నీకు నభీష్టసౌఖ్యములు సిద్ధించున్. 57

టీ. వినుము. అదియుంగాక = అట్టిమహారాజు నీకు భర్త యగుటయే గాక, నేన్ = నేను, ప్రియంబునన్ = అనురాగముతో, పద్మిని, అనం బరంగిన విద్యన్ = అని పిలువఁబడు విద్యను, ఇత్తున్ = ఒసంగెదను. నీవు, కొను = గ్రహింపుము. తత్ప్రసాదంబునన్ = ఆవిద్యయొక్క యనుగ్రహముచే, నీకు, అభీష్టసౌఖ్యములు = కాంక్షించిన సుఖములు, సిద్ధించున్ = దొరకును.

తా. నీ విటువై స్వరోచిం బెండ్లియాడునట్టిభాగ్యము ప్రాప్తించుటయే కాక, యీ వెంటనే నీవు కోరినసౌఖ్యములఁ జేకూర్చునట్టి పద్మిని యను విద్య నుపదేశముచేసెద దానిం గైకొనుము.

వ. అని రహస్యంబుగా నవ్విద్య నాకు నుపదేశించి ముక్కంటి వాల్గంటి మింటిచొప్పునం జనియె నేనును దద్వచనామృతాస్వాదనంబ యూఁతగాఁ బ్రాణంబులు వట్టుకొని యున్నదాన నాస్వరోచి నీవ కాఁ దలంచెద వంచనాలాపంబు లుడిగి యప్పద్మినీవిద్యారత్నంబుతోఁ గూడ నన్నుం బరిగ్రహింపుమనిన నంగీకరించి యమ్మహీవిభుండు. 58

టీ. అని = ఇటు లానతిచ్చి, రహస్యంబుగాన్ = మిగులగోప్యముగా, అవ్విద్య = ఆ పద్మిని యనువిద్యను, నాకున్, ఉపదేశించి=చెప్పి, ముక్కంటి వాల్గంటి = ఈశ్వరి, మింటిచొప్పునన్ = గగనమార్గమున, చనియెన్ = పోయెను. నేనును, తద్వచనామృతాస్వాదనంబ = ఆయమనుడువు లను నమృతమును గ్రోలుటయే-అమృతమువలెఁ దీయఁగా నున్నమాటల నాసక్తితో నాలించి యనుట. ఊఁతగాన్ = ఆధారముగా, ప్రాణంబులు = జీవనములను, పట్టుకొని = విడువక, ఉన్నదానను, అమృతపానమునఁ బ్రాణము

పోవనటుల గిరిజావాక్యామృతము గ్రోలుటచే మరణింపఁజాలక యెటులో బ్రదికియుంటిని. ఆస్వరోచి, నీవ కాక = నీవే యని, తలంచెదక =ఊహించెదను. వంచనాలాపంబులు=మాయమాటలు, తనంత వలచి వచ్చె నని తలంచి పరిహాసములతోఁ గాలయాపనము గావించెదవేమో ! వానిని, ఉడిగి = విడిచి, అప్పద్మినీవిద్యారత్నంబుతోఁగూడక =చక్కనియాపద్మినీవిద్యతోడ, నన్నుక = నన్ను, పరిగ్రహింపుము = చేకొనుము. అనినక, అంగీకరించి=ఇష్టపడినవాఁడై, అమ్మహీవిభుండు = ఆస్వరోచి. ముందఱికన్వయము.

క. ఏకాగ్రత నవ్విద్యలు
   గైకొని పుణ్యాహపూర్వకంబుగ గుణర
   త్నాకరుఁ డయ్యిద్దఱ న
   స్తోకోన్నతిఁ బెండ్లి యయ్యె సుముహూర్తంబునన్. 59

టీ. గుణరత్నాకరుఁడు=గుణము లనురత్నముల కునికిప ట్టయినస్వరోచి, ఏకాగ్రతక = నిశ్చలచిత్తముతో, అవ్విద్యలు = మృగపక్షిభాషలు తెలియఁ నట్టిదియు, పద్మిని యనునదియు నగు నారెండు విద్యలను, కైకొని=గ్రహించి పుణ్యాహపూర్వకంబుగక = పుణ్యాహవాచనవిధానముతో, సుము... మునక = మంచిలగ్నమున, అస్తోకోన్నతిక = అధికగౌరవముతో, అయ్యిద్దఱక = విభావసి కళావతి యనునిరువురుకన్నెకలను, పెండ్లియయ్యెక = వివాహము చేసికొనెను.

తా. ఆస్వరోచి యాయిద్దఱవలనను రెండువిద్యలను నేర్చికొని యొక సుముహూర్తమునఁ బుణ్యాహవాచనము చేసికొని మిగులవైభవముతో నయ్యిరువురం బెండ్లియాడెను.

ఉ. ఆసమయంబునక మొరసె నభ్రపథంబున దేవదుందుభుల్
   నేసలు చల్లి రచ్చరలు సిద్ధనికాయము చేరి సన్నుతుల్
   సేసెఁ బ్రసూనవృష్టి గురిసెక జనరంజనకారివాసనో
   ల్లాసము లై చెలంగె శుభలక్షణదక్షిణగంధవాహముల్.

టీ. ఆసమయంబునన్ = ఆ పెండ్లిజరిగినకాలమందు, అభ్రపథంబునన్ = గగనంబునందు, దేవదుందుభులు = దేవతలభేరీవాద్యములు, మొరసెన్ = ధ్వనిచేసెను. అచ్చరలు = అప్సరస్త్రీలు, సేసలు = మంగళాక్షతలు, చల్లిరి. సిద్ధనికాయము = సిద్ధులయొక్క సముదాయము, చేరి = సమీపించి, సన్నుతు ల్సేసెన్ = స్తోత్రముచేసెను. ప్రసూనవృష్టి = పుష్పవర్షము, కురిసెన్, జన రంజనకారి = ప్రజలకానందముఁ బుట్టించునట్టి, వాసన = సౌరభముచేత, ఉల్లాసములు = తగినవి, ఐ, శుభ = శుభమైన, లక్షణ = చిహ్నములుగల, దక్షిణగంధవాహములు = మలయమారుతములు, చెలంగెన్ = వ్యాపించెను.

దక్షిణగంధవాయువులు వీచుట శుభసూచకము. కాళిదాస మహా కవియుం మేఘసందేశమునందు శుభశకునములు జెప్పుచు—"మందంమందం నుదతి పవనః"అని దక్షిణవాయువును శుభప్రదముగాఁ జెప్పెను. ఉత్తరదిశకు మేఘుఁ డేఁగుట కనుకూలముగా గాలివీచుచున్న దను కాళిదాసునిభావము ప్రకృతమున కనుకూలముగ నున్నది.

తా. ఆ పెండ్లి జరిగినసమయమందు, గగనమున దేవదుందుభులు మ్రోఁగెను. అప్సరసలు శుభాక్షతలు చల్లిరి. సిద్ధులు పొగడిరి. పుష్పవర్షము కురి సెను. ప్రజల కానందమును గలుగఁజేయునట్టి పరిమళముచే నొప్పునవి యై మంచి చిహ్నములు గలవి యైన మలయమారుతములు వీచెను.

క. ఈవిధమున నుద్వాహం
బై వేలుపువెలఁదిపట్టి యంచితమతి న
ప్పూవుంబోఁడులు మూవుర
తో వివిధవిహారసంగతులఁ దత్పరుఁ డై. 61

టీ. వేలుపువెలఁదిపట్టి = స్వరోచి, ఈవిధమునన్ = ఈప్రకార ముగా, ఉద్వాహంబై = విభావసిని కళావతినిఁ బెండ్లియాడి, అంచితమతిన్ = మంచిబుద్ధితో, అప్పూవుంబోడులు మూవురతోన్ = అముగ్గురుసతులతో

వివిధ విహారసంగతులన్ = అనేక విధము లయిన వేడుకలఁ దిరుగునట్టి వర్తనములయందు, తత్పరుఁడై = ఇష్టముకలవాఁడై, ముందఱికన్వయము.

తా. స్వరోచి యిట్లాయిద్దఱిం బెండ్లియాడి మంచిబుద్ధితోఁ దనము గ్గురు భార్యలంగూడి నానావిధవిలాసప్రవర్తనములయం దాసక్తిగలవాఁడై.

సీ. గంగాతరంగిణీరంగత్తరంగశీ
కరశీతసైకతోత్కరములందు
మందారమాకందమకరందతుందిలేం
దిందిరానందకృన్నందనములఁ
గాంతనిశాకాంతకాంతవితర్దికా
క్రాంతభూభృద్బృందకందరముల
మసృణబిసాహారమాంసలహంసికా
సంసదాసారకాసారతటులఁ

తే. దమక తమక ప్రియుం డని తమక మెసఁగఁ
బడఁతు లుప్పొంగఁ గ్రీడించెఁ బద్మినీప్ర
భావఘటితాన్నపానభూషావిశేష
మాల్యవస్త్రానులేపసామగ్రిఁ జెంది. 62

టీ. గంగాతరంగిణీ=గంగానదియందు, రంగత్=ఆడుచున్న, తరంగ = కెరటములయొక్క, శీకర = తుంపురులచేత, శీత = చల్లఁదనముగల, సైకత = ఇసుకదిబ్బలయొక్క, ఉత్కరములందున్ = సముదాయములందును మందార = మందారపుఁ జెట్లయొక్కయు, మాకంద = తియ్యమామిడిచెట్ల యొక్కయు, మకరంద= పూవుఁదేనెలచేత, తుందిల = మదించిన, ఇందిందిర= తేంట్లకు, ఆనందకృత్ = ఆనందమును గలుగఁజేయుచున్న, నందనములన్ = ఉద్యానవనములందును, కాంత = హృదయానందము లయిన, నిశాకాంత కాంత = చంద్రకాంతమణులచేఁ గూర్పఁబడిన, వితర్దికా = తిన్నెలచేత

ఆక్రాంత = చుట్టుకొనఁబడిన, భూభృద్బృంద = పర్వతసముదాయముయొక్క, కందరములన్ = గహ్వరములయందును, మసృణ = మృదువైన, బిస = తామర తూండ్లయొక్క, ఆహార = భక్షణములచేత, మాంసల = బలిసిన, హంసికా = హంసాంగనలయొక్క, సంసత్ = ప్రోగులయొక్క, ఆసార = సర్వవ్యాపకములు గల, కాసార = చెరువులయొక్క, తటులన్ = ఒడ్డులయందును, పతిఁతులు = ముగ్గురుసతులును, తమకతమక = తమ కేతమ కే (ఎవరియంతటవారే,) ప్రియుండు = ఇష్టముకలవాఁడు, ఎవరికి వారు నాయందె స్వరోచి మక్కువగా నుండె నని, ఉప్పొంగన్ = ఆనందింపఁగా, పద్మినీ = పద్మిని యనువిద్యయొక్క, ప్రభావ = మహత్తుచేత, ఘటిత = సంఘటింపఁబడిన, అన్న = అన్నము, పాన = త్రాగునట్టి తేనె, పాలు, నీరు మొదలయినవి, భూషావిశేష = అలంకార విశేషములు, మాల్య = పుష్పమాలికలు, వస్త్ర = వస్త్రములు, అనులేప మంచి గంధము మున్నగుపూఁతలు, సామగ్రిన్ = వీనియొక్క సంపూర్ణతను, చెంది, క్రీడించెన్.

మొదటిపాదమునందు నదీతీరవిహారము, రెండవపాదమున వనవిహారము, మూఁడవపాదమున శైలవిహారము, నాలుగవపాదమున సరోవరవిహారమును గావించి రని చెప్పఁబడెను.

తా. స్వరోచి ముప్వురు భార్యలు వెంటనంటిరాఁ బద్మినీవిద్యామహిమచే నన్నపానీయములకును వస్త్రాలంకారములకును గంధపుష్పములకును లోప మెంతమాత్రమును లేక పోఁగా నదీ సైకతప్రదేశములందును, మకరంద భరితమై తేంట్లరొదలఁ బొదలు విహారవనములయందును, చంద్రకాంతశిలా వేదికలచే నింపుమిగులు పర్వతగహ్వరములయందును, తామరతూండ్లు మెసవి చియ్యపట్టిన హంసలు వేనవేలు సంచరించుచున్న సరస్తీరములందును సంచరించుచుఁ గ్రీడ గావించెను. అలం. ఉదాత్తము.

మ. అరవిందాక్షులుఁదాను నిట్లభిమతవ్యాపారముల్ సల్పుచున్
ధరణీశుండొకచోటఁగాంచె లఘుశీతస్వచ్ఛవాఃపూరమున్

వరకీరవ్రజచంచుపాటితతటవ్యాకీర్ణమందారకే
సరమాకందవినిస్సరత్ఫలరసాసారంబుఁ గాసారమున్. 6[illegible]

టీ. ఇట్లు=ఈవిధముగా, ధరణీశుండు = స్వరోచి, అరవిందాక్షులున్ = తామరరేకులవంటి విశాలము లగు కన్నులుగల యాముగ్గురు భార్యలును, తానును, అభిమత వ్యాపారములు = కాంక్షించిన విహారంపుఁ బనులను, సల్పుచున్ = ఒనర్చుచు, ఒకచోటన్=ఒకానొక ప్రదేశమునందు, లఘు = తేలికయైన, శీత = చల్లనయిన, స్వచ్ఛ = విమలమైన, వాఃపూరమున్ = జలముచే నిండినదియు, వర=ఉత్తమమయిన, కీర = శుకముయొక్క, వ్రజ=సముదాయముయొక్క, చంచు=ముక్కులచేత, పాటిత=బ్రద్దలు చేయఁబడిన వయి, తట=ఒడ్డులయందు, వ్యాకీర్ణ=నిండుకొనిన, మందార = మందారవృక్షములవలనను, కేసర = వకుళవృక్షములవలనను, మాకంద = తియ్యమామిడిచెట్లవలనను, వినిస్సరత్ = ఎక్కువగాఁ గాఱుచున్న, ఫలరస = పండ్లరసములయొక్క, ఆసారంబున్ = అడ్డులేని జడివాన గలదియు నగు, కాసారమున్ = సరస్సును, కాంచెన్ = వీక్షించెను.

ఫలవృక్షములు ఒడ్డులయందు నిండుకొని యున్నవనుటచేఁ జిలుకలు నొక్కినఫలరస మంతయుఁ బడుట కనుకూలముగా నుండె ననుట. కీరములు వ్రజమనుటచే నసంఖ్యాకముగ నుండెననుట. కావుననే వానిచే నొక్కఁబడిన ఫలరసము జడివానవలెఁ గాఱుట. లఘుత, శీతత, స్వచ్ఛత, జలప్రశస్తిం దెలుపును.

తా. సతులతో నిట్లు యథేష్టముగాఁ గ్రీడ సలుపుచు నొక ప్రదేశమునఁ దేలికయై చల్లఁగా నున్న నిర్మలోదకముతో నిండియున్నదియు, నొడ్డులయందలి చెట్లనుండి చిలుకముక్కులచేఁ బగులఁ గొట్టఁబడిన ఫలములనుండి స్రవించుచున్న మధురరసముతోఁ గూడినదియు, నగు నొకానొకసరస్సును గాంచెను.

క. కని తత్తటస్థలంబున
ననుమతి విహరించె సవిధహరిహయవరనం
దననందనహరిచందన
వనపవనార్భకవినోదవశగతుఁ డగుచున్. 64

టీ. కని = సరస్సును వీక్షించి, తత్తటంబునన్ = ఆసరస్తీరమున, సవిధ = చేరువ నున్న, హరిహయ = దేవేంద్రునియొక్క, వర = ఉత్తమ మయిన, నందన = నందనోద్యానవనసంబంధమయిన, (హరిహయవరనందన = జయంతునియొక్క, నందన = నందనోద్యానవనమున నున్న, అని యర్థాంతరముగూడఁ గలదు.) నందన = స్వీయోద్యానవనమునందలి, హరిచందన = హరిచందన మను సురభూజములయొక్క, వన = తోఁటనుండి వీచునట్టి, పవనార్భక = పిల్లతెమ్మెరలచేత, వినోద = క్రీడించుటకు, వశగతుఁడు = ఆయత్తమైనవాఁడు, అగుచున్, అనుమతిన్ = ఇచ్ఛతో, విహరించెన్ = సంచరించెను.

తా. స్వరోచి యాసరస్సుం గాంచి దానిసమీపమున నందనవనము రీతిని దేవతరులతోఁటలుగల తనశృంగారారామమునుండి వీచునట్టి మలయమారుతముచే నానందింప నిచ్ఛగలవాఁడై కోరికతో నాసరస్తీరమునఁ గొంత తడవు విహారము సల్పెను.

ఉ. అందొకయంచలేమ గహనానిలసంచలదూర్మిమాలికా
మందవిహారసౌఖ్యమున మత్తిలి దవ్వుల నున్న చక్రవా
కిం దగఁ జేరఁ బిల్చి పరికించి తెయెంతతపం బొనర్చి రీ
యిందునిభాస్యలుం బతియు నేకమతిన్నవగూడియుండఁగాన్.

టీ. అందున్ = ఆసరస్సునందు, ఒక యంచలేమ = ఒక హంసాంగన, గహన = ఉద్యానవనమునుండి యేతెంచుచున్న, అనిల = వాయువుచేత, సంచలత్ = చక్కఁగా నాడుచున్న, ఊర్మి = కెరటములయొక్క,

టీ. అని, పలుకు నమ్మరాళలోలనయన పలుకులు = పలుకునట్టి యా హంసాంగన పలుకులు, అలంబుచేసి = ఒప్పుకొనక, చక్రవాకి = ఆఁడు జక్కవ, ఇట్టనియెన్ = ఈవిధముగా బదులు చెప్పెను.

చ. ముదమునయిమ్మహీశుఁడొకముద్దియచూడఁగనొక్కకాంతతో
సదమదమై కడంగి రతి సల్పుట తెల్లమిగా నెఱింగియున్
మది వివరించి రోయ కభిమానము దక్కినవీరికూరుముల్
వదలక పెద్ద సేసెదవు వందిగతిన్ దగ వీవిచారముల్. 69

టీ. ముదమునన్ = కుతుకముతో, ఇమ్మహీశుఁడు = ఈరాజు, ఒక ముద్దియ=ఒక్కసుందరి, చూడఁగన్=చూచుచుండఁగా, ఒక్కకాంతతోన్ = మఱియొకసుందరితో, సదమదమై=పెనఁగి, కడంగి = ప్రయత్నించి, రతి = సంగమము, సల్పుట=ఒనర్చుట, తెల్లమిగాన్=విస్పష్టముగా, ఎఱింగియున్ = తెలిసికొనియు, మదిన్=హృదయమునందు, వివరించి = (ఇతం డన్యసుందరీ ప్రియుం డని) యాలోచించి, రోయక=అసహ్యాతను జెందక, అభిమానము= గౌరవమును, తక్కిన వీరికూరుముల్ = మిగిలినయీసుదతుల ప్రేమలు, వదలక=విడువక, వందిగతిన్=బట్టువలె, పెద్దచేసెదవు=ఘనముగా స్తోత్రము చేసెదవు, ఈవిచారముల్=ఈయూహలు, తగవు=పనికి రావు.

తా. ఈరాజు ఒకస్త్రీతో సంభోగించుచుండుటఁ దెలిసికొనియుఁ దక్కిన సుదతులు అసహ్యించుకొనక యభిమానము చెడియున్న వీరల కూరుముల గోరంతలు కొండంతలు చేసి బట్టువలె నీవు పొగడుచున్నావు. ఇట్టి కృత్రిమప్రేమను బ్రశంసించుట తగదు. అలం-ఉపమ.

చ. పలువురయందునొక్కనికిబ్రాఁతియునొక్కనియందుఁజూడ న
గ్గలమగుప్రేమ పల్వురకుఁ గల్గుట యద్భుత మట్లు గాన ని
వ్వెలదులయందుఁ గూర్మి పస వీనికి నేమియు లేదు వీనియం
దలవడఁ గల్గ దీజలరుహాక్షులకున్ బ్రియ మెవ్విధంబునన్.

టీ. చూడన్=ఆలోచించి చూడఁగా, పలువురయందున్=అనేకసుందరులందు, ఒక్కనికిన్ = ఒకపురుషునకు, బ్రాఁతియున్ = ప్రియమును, ఒక్కనియందున్=ఒకపురుషునియందు, పల్వురకున్=అనేకసుందరులకు, అగ్గలము=ఎక్కువ, అగు ప్రేమ = ఐనయట్టి యనురాగము, కల్గుట = కలిగియుండుట, అద్భుతము=చిత్రము, అట్లు, కానన్=కావున, ఇవ్వెలఁదులయందున్=ఈసుందరులయందు, వీనికిన్ = ఈపురుషునకు, మార్మిపస=ప్రేమాతిశయము, ఏమియున్ లేదు=కొంచెముగూడ లేదు. వీనియందున్ = ఈపురుషునియందు, ఈజలరుహాక్షులకున్ = ఈసుందరులకు, ప్రియము = అనురాగము, ఎవ్విధంబునన్ = ఏప్రకారముచేతను, అలవడన్ = పనుపడుట, కల్గదు = కలుగఁజాలదు.

"ఏకత్రైవానురాగశ్చేత్ తిర్యఙ్మ్లేచ్ఛగతోఽపి వా,
యోషితాం బహుసక్తిశ్చ రసాభాసస్త్రిధా స్మృతః."

అనునది యిట ననుసంధించుకొననగును.

తా. ఒకనికిఁ జాలమంది సుందరులయందును, జాలమంది సుందరుల కొక్కపురుషునియందును బ్రేమ యుండుట కష్టము. కావున వీనియం దీసుదతులకుఁగాని యీ సుదతులయం దీతనికిఁగాని యెంతమాత్రముఁ బ్రేమ యుండదు.

క. మనుజేశుఁడు కొలిచినపరి
జనములతో నిష్టగోష్ఠి సలిపెడిచో నె
ట్లనురాగ మట్ల కూరిమి
వనితలు పెక్కండ్రయం దవశ్యము పతికిన్. 71

టీ. మనుజేశుఁడు = నృపాలుఁడు, కొలిచినపరిజనములతోన్=తన్ను సేవించునట్టి పరివారముతో, ఇష్టగోష్ఠి=ప్రియాలాపము, సలిపెడిచోన్ = చేయునప్పుడు, అనురాగము=ప్రేమ, ఎట్లు=ఎట్లో, అట్ల = అట్లులనే, వని

తలు=సుందరులు, పెక్కంద్రయందుఁ = పలువురయందు, పతికిఁ = పెని మిటికి, కూరిమి=అనురాగము, అవశ్యము = ముఖ్యముగా కలుగు నని యిట నర్థ్యాహార్యము.

తా. నృపాలునకు సేవకులయందువలెఁ బురుషునకుఁ బలువురు సుద తులయందుఁ బ్రేమ యుండునేకాని యొక్కభార్యయందువలె గాఢాను రాగము కలిగియుండదు. అలం-ఉపమ.

క. ఈనెలఁత లీమహీశు న
హీనగతిఁ దగిలిరేని నితఁ డొకలేమన్
దా నెలమిఁ గూడునెడ నే
మానిని ప్రాణేశుమీఁదిమమత మెలంగున్. 7

టీ. ఈనెలఁతలు = ఈవనితలు, ఈమహీశున్ = ఈరాజును, అహీ గతిన్ = కొఅంతలేని హృదయములతో - ఎట్టిలోపమును హృదయమున దుంచుకొనక, తగిలిరేనిన్ = వలచియున్నయెడల, ఇతఁడు = ఈరాజు తాను, ఒకలేమన్=ఒకచిన్నదానిని, ఎలమిన్ = ప్రేమతో, కూడునెడన్ రతి సలుపునప్పుడు, ఏమానిని = వీరిలో నేచిన్నది, ప్రాణేశుమీఁదిమమతన్ భర్తయందలిప్రేమతో, మెలంగున్ = వర్తించును. ఏసతితో రాజు గల యుండునో యాసతి యనురాగవతివలెఁ గనిపించునుగాని యందఱకు సమ నానురాగము గలుగఁ జాల దనుట.

తా. ఈచెలువలందఱును రాజునెడనే వలపుగలవారలై యుండిరి రాజు వేఱొకచెలితో సంభోగసౌఖ్యము ననుభవించునపుడు మిగిలినచెలువ కెవరికేని వల్లభునిమీఁదఁ గొంచెమేని ప్రేమయుండునా !

క. కావున దాసీనికరము
కైవసమై సంచరించుక్రమమున విద్యా

ప్రావీణ్యవైభవోన్నతి
చే వచ్చినవారి వీరిఁ జెప్పకు మింకన్. 73

టీ. కావునన్ = అట్లుకావున, దాసీనికరము= ఊడిగంపుస్త్రీల సముదాయము, కైవసమై = స్వాధీనమై, సంచరించు క్రమమునన్ = తిరుగునట్టి పోలికను, విద్యా = విద్యలయందలి, ప్రావీణ్య=నేర్పుయొక్క, వైభవ = సంపదవలని, ఉన్నతిచేన్ = గౌరవముచేత, వచ్చినవారిన్ = దొరకిన వారిని, వీరిన్ = ఈసుందరులను, ఇంకన్ = ఇంకమీఁద, చెప్పకుము = పొగ్చుగాఁ బ్రశంసింపకుము.

తా. కావున దాసీజనము చాలమంది యొకనిస్వాధీనములో సంచరించురీతిని విద్యాసంపదచే నీతనికి దొరకిన యీసుందరులవిషయమై గొప్పలు చెప్ప నొప్పదు.

ఆ. తగులు నెవ్వఁ డొక్కతరుణికి నొకనికి
మెలఁత వలచునదియ మే లనంగ
వచ్చుఁ గాని పెక్కువనితలపైఁ గూర్మి
గలుగు ననుట బొంకు గాదె తరుణి. 74

టీ. తరుణి=ఓ సుందరీ! ఎవ్వఁడు=ఏపురుషుఁడు, ఒక్కతరుణికిన్ = ఒక్కయువతియెడ, తగులున్ = మోహించునో, మెలఁత = ఒకజవరాలు, ఒకనికిన్ = ఒక్కనియెడ, వలచున్ = మోహించునో, అదియ = ఆమోహామే, మేలు = శ్రేష్ఠమైనది, అనంగవచ్చున్ = అని ప్రశంస గావింపవచ్చును. పెక్కువనితలపైన్ = అనేకస్త్రీలమీఁద, కూర్మి = ప్రేమ, కలుగును = ఒకనికి గలిగియుండును అనుట, బొంకు = అబద్ధము, కాదే=కాదా.

రసగంగాధరమునందు-"తత్ర స్త్రీపుంసయోరన్యోన్యాలంబనః ప్రేమాఖ్యశ్చిత్తవృత్తివిశేషో రతిః స్థాయిభావః"-అని వ్రాయఁబడెను. స్త్రీలకును బురుషులకును బరస్పరాలంబనమైన ప్రేమ మనెడి చిత్తవృత్తివిశేషమే రతి యను నాలంకారికధర్మ మిట గ్రాహ్యము.

తా. ఓ నెచ్చెలీ! ఒక్క మగవాని కొక యాఁడుదాని పయిని, ఒక యాఁడుదాని కొక మగవానిమీఁదను బ్రేమయుండెడి నన్న నవచ్చుంగాని పలువురుసుందరులయం దొకమగవానికిఁ బూర్తి యున్న దనుట కల్ల.

చ. పలుకులు వేయు నేమిటికి భాగ్యసమన్విత నేన మద్విభుం
డిలఁ గలధన్యుఁ డంచు నెలుఁగెత్తి వరూథినిపట్టిముందటన్
బలుకురథాంగమానవతిపల్కు లతం డిల జంతుమండలీ
విలసదశేషభాషలఁ బ్రవీణుఁడు గాన నెఱింగి సిగ్గునన్. 75

టీ. పలుకులు = మాటలు, వేయున్ = పెక్కులు, ఏమిటికిన్ = ఎందుకు, భాగ్యసమన్వితను = భాగ్యవంతురాలను, నేన = నేనే, ఇలన్ = ధాత్రియందు, కలధన్యుఁడు = కలిగినభాగ్యవంతుఁడు, మద్విభుండు = నా పెనిమిటి, అంచున్ = అని, వరూథినిపట్టిముందటన్ = స్వరోచియెదుట, ఎలుఁగెత్తి = కంఠమెత్తి, పలుకురథాంగమానవతిపల్కులు = చెప్పుచున్న చక్రవాకాంగనయొక్క పలుకులు, ఇలన్ = పుడమియం దుండెడు, జంతుమండలీ = జీవనసముదాయములయొక్క, విలసత్ = ప్రకాశించుచున్న - ఒప్పుచున్న, అశేష = ఎల్ల, భాషలన్ = పలుకులయందు, ప్రవీణుఁడు = తెలిసినవాఁడు, కానన్ = కాఁబట్టి, ఎఱింగి = తెలిసికొని, సిగ్గునన్ = లజ్జచేత, ముందఱికన్వయము.

తా. పలుపలుకు లేల? నేనే యదృష్టము గలదానను. నాభర్తయే భాగ్యవంతుఁ డని ముందఱ బాగుగా వినఁబడునట్లు గొంతెత్తి మాటలాడుచున్న యాచక్రవాకాంగనపలుకు లాలించి సకలజంతుభాషల నెఱింగినవాఁడు గావున నాపక్షివాక్యములయర్థమును గ్రహించి లజ్జతో.

క. తల వాంచి యుస్సురని మదిఁ
దలపోయుచు మానశాలితమకంబున నా
నెలఁతలతో నూఱేఁడులు
విలసితగతి సౌఖ్య మనుభవించుచు నెలమిన్. 76

టీ. తలవాంచి = శిరస్సు వంచుకొని, ఉస్సు రని=నిట్టూర్పుతో నుస్సు రని, మదిఁ = చిత్తమునందు, తలపోయుచుఁ = విచారించుచు, మానరాని తమకంబునఁ = విడువఁగూడని యనురాగముచేత, ఆనెలఁతలతోఁ = ఆ ముగ్గురు సుందరులతోను, విలసితగతిఁ = చిత్తానందమైనరీతితో, నూఱేఁడులు=నూఱువత్సరములు, ఎలమిఁ=ప్రేమతో, సౌఖ్యము, అనుభవించుచుఁ = కాంచుచు. ముందటి కన్వయము.

తా. తలవంచికొని యుస్సురని నిట్టూర్పు పుచ్చుచు హృదయమునందు పీడరాని ప్రేమచేత ముగ్గురుభార్యలతోను హృదయానందకరముగా నూఱు సంవత్సరములు ప్రీతితో సుఖ మనుభవించుచు.

శా. కాంచెఁ భూవిభుఁడొక్కనాఁడుకనకాఖర్వప్రభామంజులా
స్యాంచన్మేచకరత్నవిభ్రమసనాథానూనదృగ్రోచులన్
మించుంబ్రాయపులేటిపిండు తనుఁ గూర్మిం జుట్టిరాఁ దద్వనో
దంచద్భూమిఁజరించు నొక్కహరిణోత్తంసంబునింపారఁగాన్.

టీ. భూవిభుఁడు = స్వరోచి, ఒక్కనాఁడు = ఒకానొకదినమునందు, కనక = సువర్ణముయొక్క, అఖర్వ = ఎక్కువయిన, ప్రభా = కాంతులచేత, మంజుల=ఆనందదాయకము లయిన, ఆస్య=మోమునందు, అంచత్ = ప్రకాశించుచున్న, మేచకరత్న = ఇంద్రనీలమణులయొక్క, విభ్రమ = విలాసము వంటి విలాసముతో, సనాథ=కూడిన, అనూన=హీనముకాని, దృగ్రోచులన్ = వీక్షణముల ప్రకాశముచేత, మించుంబ్రాయపు = ప్రకాశించుచున్న జవ్వనము గల, లేటిపిండు=ఆఁడులేళ్ల సముదాయము, తన్నుఁ, కూర్మిఁ = ప్రేమతో, చుట్టిరాఁ = చుట్టుకొనిరాఁగా, తద్వనోదంచద్భూమిఁ=ప్రకాశించుచున్న యయ్యరణ్యప్రదేశమందు, చరించు = సంచరించుచున్న, ఒక్కహరిణోత్తంసంబుఁ = ఒక మంచిలేడిని, ఇంపారఁగాఁ = సంతోషము వృద్ధికాఁగా, కాంచెఁ.

లేడిచూపులు మిగుల నల్లగా నుంట సహజము; గాన కృష్ణగణముగ జెప్పుట ప్రసిద్ధము. చంపూభారతమునందును, లేడిచూపు లిటులె నల్లనివి వర్ణింపఁబడెను.—

శ్లో. "క్షోణీపతౌ మదకలం ప్రతికృష్ణసారం
తూణీముఖే పతితపాణినఖాంకురేఽస్మిన్,
ఏణీకులాని తరసైర్యమునాజలానాం
వేణీమివాక్షివలసైర్వ్యపినే వితేనుః."

(ప్రథమ స్తబకము శ్లో-౨౧.

తా. స్వరోచి యొకదినమునఁ గేళికావనమునందు స్వర్ణచ్ఛాయ గల ముఖములును, నీలమణిప్రభలవంటి ప్రభలుగల వీక్షణములు గల హరిణములతోఁగూడి సంచరించు నొక యుత్తమ మగు నిఱ్ఱిని గాంచెను. అలం. నిదర్శన.

క. కని సతులకుఁ జూపెడుతఱి
ఘనముగఁ దమచెవుల వాలుఁగన్నులు సోఁకన్
మొనసెలవి యెత్తి ప్రియునా
ననముఁ మూర్కొనుచు నఱ్ఱు నాకెడు వేళన్. 78

టీ. కని, సతులకున్ = భార్యలకు, చూపెడుతఱిన్ = చూపునప్పుడు, ఘనముగన్ = ఎక్కువగా, తమచెవులన్ = తమకర్ణములయందు, వాలుఁగన్నులు=దీర్ఘములయిన నేత్రములు, సోఁకన్ = వ్రాలఁబడఁగా, మొనసెలవి = ముందటిపెదవియొక్క మొదలు, ఎత్తి=మీఁదికెత్తి, ప్రియునాననమున్=తమభర్త యగు జింకయొక్క మోమును, మూర్కొనుచున్ = వాసనఁ జూచుచు, అఱ్ఱునాకెడు వేళన్=మెడను నాకుసమయమందు. ముందటికన్వయము.

తా. అట్లు సంచరించుచున్న లేడిని స్వరోచి భార్యలకుఁ జూపించునప్పుడు దానిజత యగునాఁడులేళ్లు తమ పెద్దకన్నులు కర్ణములవఱకు వ్యాపించి

ప్రకాశింపఁగా నట్టులెత్తి యాలేడిమోమును వాసనఁ జూచుచు నట్టు నాడు చున్నవేళయందు. అలం-స్వభావోక్తి.

శా. హుంకారం బొనరించి వే తలఁగుఁడో హో నేను స్వారోచినే
పంకేజాక్షులతోడ నెల్లపుడు దర్పస్ఫూర్తిఁ గ్రీడింప ల
జ్జాంకూరం బడఁగించినారు తలపోయన్ నాకురోఁతయ్యె మీ
రింకన్ బోయివరింపుఁడొక్కరునిభోగేచ్ఛన్ నివారించితిన్.

టీ. పూర్వోక్తమృగము పెంటిమృగములఁ జూచి యిట్లు చెప్పు చున్నది.—హుంకారంబు = క్రోధమును దెలియఁజేయు హుమ్మను శ్రుతి కటువైన ధ్వనిని, ఒనరించి = చేసి, ఓహో = ఓసుందరులారా! వే = వేగ ముగా, తలఁగుఁడు=ఒత్తిగిలిపొండు, ఎల్లపుడున్ = అన్ని సమయములందును, దర్పస్ఫూర్తిన్ = మదోన్నతిచేత, పంకేజాక్షులతోడన్ = పద్మాక్షులగు సుందరులతో, క్రీడింపన్=క్రీడింపను, నేను, స్వారోచినే=స్వరోచియను రాజునా, లజ్జాంకూరంబు = మొలకసిగ్గును, అడఁగించినారు=పోఁగొట్టినారు. మీరు సిగ్గు విడిచి సంచరించుచుంటి రనుట. తలపోయన్ = (మీసిగ్గుమాలిన తనమును) ఆలోచింపఁగా, నాకున్, రోఁతయ్యెన్=అసహ్యమాయెను. మీరు= మీరందఱును, ఇంకన్ = ఇఁకమీఁద, పోయి = నన్ను వదలి వెడలిపోయి, ఒక్కరునిన్=ఇంకొకమగవానిని, వరింపుఁడు=వేఁడుకొనుఁడు. భోగేచ్ఛన్ = రతిసౌఖ్యమునందలికోరికను, స్త్రీసుఖమునందలి వాంఛ ననుట. నివారించితిన్= మానితిని=నిలిపివేసితిని, ఇంద్రియచాపల్యము నడంచికొంటి నని భావము.

తా. ఆలేడి యాఁడులేళ్లపైఁ గోపించి కలకాలము స్త్రీలతోఁ గలిసి రమించుటకు నేను స్వరోచిని గాను. మీరు లజ్జఁ ద్యజించి విహరించు చున్నారు. మీవర్తనములు గాంచిన నా కసహ్య మగుచున్నది. కాఁబట్టి మీతోడి సౌఖ్యమునకు సంతసింపను. కావలసినచో మీరు మఱియొక మగ వానినిఁ గోరుకొనుఁడు వెళ్లుఁ డనియెను.

చ. బరు వనకింతులం దనకుఁ బల్వురఁ గూర్చుటభోగవాంఛఁగా
కరయఁగ నొండు గాదు ధన మన్న ధ్రువంబుగనంగనాజనో
త్కరసముపార్జితం బటులుగావున వీనికి లే దిహంబునుం
బరమును నన్ను నట్ల పఱుపం బనిలే దిది చెప్ప నేటికిన్.

టీ. బరువు=భారము-కష్టము, అనక=అని తలంపక, తనకున్=తనకై, ఇంతులన్=సుందరులను, కూర్చుట=కూర్చుకొనుట, భోగవాంఛన్ = సౌఖ్యానుభవమందలి కోరికచేతనే, కాక, అరయఁగన్ = ఆలోచింపఁగా, ఒండు గాదు=మఱియొకటి కాదు. ధనము=ద్రవ్యమో, అన్నన్=అనినను, ధ్రువంబుగన్ = నిశ్చయముగా, అంగనాజన = సుదతీజనముయొక్క, ఉత్కర = సముదాయముచేత, సముపార్జితంబు = ఆర్జింపఁబడినది, అటులు గావునన్ = అటులగుటచేత, వీనికిన్ = ఈస్వరోచికి, ఇహంబునున్ = ఈలోకమందలి మేలును, పరమునున్=పరలోకమందలి మేలును, లేదు. నన్నును, అట్ల=అట్లే, పఱుపన్ = పాటుపడఁజేయుట, పనిలేదు = అవసరములేదు. ఇది=ఈసౌఖ్యమును, చెప్పన్=ఇట్టిది యని వచించుట, ఏటికిన్=ఎందుకు ? పలువుర భోగించుటచేఁ గామ మారదు. ద్రవ్యము స్త్రీజనార్జితమ్ముగాన "స్త్రీవిత్త మధమాధమం" అనున్యాయముచే నదియుఁ గర్హ్యము. ఇట్టియెడ నిహపరములకుఁదా వెక్కడిది ?

తా. మగవాఁడు తనకుఁగలిగినకష్టము నాలోచింపక యూఁడువాండ్రను జేర్చుకొనుట రతికాంక్షచేతనేగాని యింకొకదానిచేఁ గాదు. వీనిభాగ్యసంపద యాసుందరులవలననే యార్జింపఁబడినది. ఇది నిశ్చయ మయినపలుకు. ఆలోచింప నింతకన్న మఱేమియుఁ గానరాదు. కావున నీనృపాలునకు నిహపరములయందు మేలు లేదు. ఈతనిరీతినే నన్నుఁగూడ నెందులకుం బనికిరానివానిగాఁ దలంపరాదు. ఈవిషయ మిట్టి దని యేర్పరింప నవసరము లేదు.

క. వీనివిధంబున వనితా
ధీనుఁడ నై పెంపు దక్కి తిరుగుచు నుండం

గా నే వెఱ్ఱినె తమకము
మాని చనుం డన్న నవియు మసలక చనియెన్. 81

టీ. ఈనివిధంబునన్ = ఈస్వరోచిరీతిని, వనితాధీనుఁడనై = స్త్రీలకు స్వాధీనమయినవాఁడ నై, పెంపు=అతిశయము, తక్కి=పోయి, తిరుగుచున్ = ప్రవర్తించుచు, ఉండంగాన్ = ఉండుటకు, నేన్ = నేను, వెఱ్ఱినె = వెఱ్ఱివాఁడనా, తమకము=అనురాగము-మోహము, మాని=విడిచిపెట్టి, చనుండు=పొండు, అనన్=అని మగలేడి పలుకఁగా, అవియున్ = ఆయాఁడులేళ్లును, మసలక = తడవుసేయక, చనియెన్ = వెడలిపోయెను.

తా. ఈస్వరోచివిధముగా స్త్రీలకు లోనై తిరుగుటకు నేను పిచ్చివాఁడను గాను. నాయందుఁ గలప్రేమను వీడి మరలిపొం డన నాయాఁడులేళ్లాలస్యము సేయక బయలుదేఱి పోయినవి.

క. ఈకరణి దూఱనాడిన
యాకృష్ణమృగంబుపల్కు లటమున్నుగ న
శోకసతి యన్నమాటలు
నేకంబై తనమనంబు నెరియం జేయన్. 82

టీ. ఈకరణిన్ = ఈతెఱఁగున, దూఱన్ = నిందించుటగా, ఆడిన = పలికిన, ఆకృష్ణమృగంబుపల్కులు = ఆనల్లలేడియొక్క పలుకులును, అటమున్నగన్ = అంతకుఁబూర్వము, అశోకసతి = ఆచక్రవాకాంగన, అన్నమాటలును, ఏకంబై=ఒకటియయి, తనమనంబునన్ = తనచిత్తమును, ఎరియం జేయన్ = దహింపఁ జేయఁగా. ముందఱి కన్వయము.

తా. ఈప్రకారము నిందఁగాఁబలికిన యానల్లలేడిమాటలను, అంతకుఁ బూర్వము చక్రవాకాంగనపలికినపలుకులును గలసి తనచిత్తమును వేధింపఁగా.

ఉ. ఆరయ నిట్టిరోఁతలకు నాలయముల్ జలజాక్షు లేటికిన్
వీరలతోడిసంగ మిఁక వీడెద నంచుఁ దలంచి తోన దు

